రిజి.నెం.
H. NL. 33
సంపుటి: 56
సంచిక: 35

# జమీన్‌రైతు

21-6-'85
శుక్రవారం
16 పేజీలు
75 పైసలు.

స్థాపకులు : నెల్లూరు వెంకట్రామానాయుడుగారు
సంపాదకుడు : నెల్లూరు శ్రీరామమూర్తి

## త్వరలో-అక్కినేని కాంగ్రెస్ ప్రవేశం?

( మా హైదరాబాదు విలేఖరి )



ప్రముఖ నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు కాంగ్రెస్(ఐ)లో చేరి త్వరలో రాజకీయ ప్రవేశం చేయవచ్చునని తెలుస్తున్నది. తాను రాజకీయాల్లో ప్రవేశించడం తథ్యమని ఎప్పుడు ఏరూపంలో అనేది ఇంకా నిర్ణయం కాలేదని శ్రీ నాగేశ్వరరావు ఇటీవల ఒక పత్రికలో స్వయంగా ప్రకటించారు. అయితే కాంగ్రెస్ (ఐ) లో శ్రీ నాగేశ్వరరావు చేరే విషయం దాదాపుగా నిర్ణయమైపోయిందని తగిన సమయంలో ఇందుకు సంబంధించి ఒక ప్రకటన చేయాలని ఆయన భావిస్తున్నట్లు విశ్వసనీయవర్గాల వారు తెలియజేశారు.

కాంగ్రెస్ (ఐ) లో చేరిన అనంతరం శ్రీ శివాజీగణేశన్ మాదిరిగా ఆయన

—కొరవ 7వ పేజీలో

## వెంగళరావుమీద రాజీవ్‌కు రిపోర్టుచేస్తాడట తె. దే. ఎం.పి.!

మా హైదరాబాదు విలేఖరి

పి. సి. సి. అధ్యక్షుడు శ్రీ జలగం వెంగళరావు మీద మచూపి తెలుగుదేశ పార్టీవారు భయపడుతున్నారు. ఆయా జిల్లాలలో పర్యటించి కార్యకర్తల అభిప్రాయాలు తెలుసుకొంటూ, పి సి సి అధ్యక్షులు వెంగళరావు నియమిస్తున్నారు. ఆయన పర్యటనకొస్తున్నట్లు కాంగ్రెస్ వాదులు, పల్లెల్లో వెల్లువెత్తుతున్న చైతన్యం చూసి వారు కలవరపడుతున్నారు. శ్రీ వెంగళరావు రాజకీయ ప్రవేశంవల్ల వచ్చిన మార్పుమగురించి ఇంటలిజెన్స్ వర్గాలవారు ఎప్పటికప్పుడు ముఖ్యమంత్రికి నివేదికలు పంపిస్తున్నారు. వెంగళరావు ఆయాజిల్లాల పర్యటనకు వెళుతుండే అదేసమయంలో ఆజిల్లాలకు కొందరు మంత్రులు కూడా వెళ్ళి పరిస్థితిని నుదింపు చేస్తున్నారు.

కాంగ్రెస్ పార్టీవారు ముందు ఇల్లు చక్కపెట్టుకోవాలని, రామారావుకు ఓటు వేసి పొరపాటుచేశామని ప్రజలు గ్రహించేదాకా ఆయనజోలికి వెళ్ళకూడదని శ్రీ వెంగళరావు చేసిన ప్రకటన ఇటు కార్యకర్తలలోనూ అటు ప్రజలలోనూ ఎంతో ప్రభావాన్ని చూపెడుతున్నది.

వెంగళరావు జోరును తగ్గించాలని రాష్ట్రానికి కావలసిన ప్రాజెక్టులగురించి ఢిల్లీలో పార్లమెంటు సభ్యులు జరుపుతున్న కృషిని గురించి వివరిస్తూ ఆయన విమర్శలకు దిగాలని ముఖ్యమంత్రి ఇటీవల లోక్‌సభలో తెలుగుదేశం పార్టీ నాయకుడు శ్రీ పి. మాధవరెడ్డిని ఆదేశించారు. ఆ ఆదేశాన్ని పాటిస్తూ శ్రీ రెడ్డి పత్రికాగోష్ఠిని నిర్వహించి శ్రీ వెంగళరావు ప్రకటనలను ఖండించారు. అయితే తెలుగుదేశానికి చెందిన పార్లమెంటుసభ్యులంతా గతకాంగ్రెస్ వారేనని, కాంగ్రెస్ పుణ్యమా అని ఎం. ఎల్. ఏ. లు, మంత్రులు కూడా అయి ప్రస్తుతం తెలుగుదేశం గొడుగు క్రింద చేరినవారికి కాంగ్రెస్‌ను విమర్శించే నైతిక హక్కు లేదని శ్రీ వెంగళరావు ప్రతి విమర్శకేని జవాబు చెప్పారు. ఎటువంటి తర్వింపు లేకుండానే శ్రీ వెంగళ తెలుగుదేశంపైన విరుచుకొనిపడుతున్నాడని ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీకి ఈ విషయం తెలిస్తే ఆయన నోరు మూయిస్తారని శ్రీ మాధవరెడ్డి వ్యంగ్యంగా ఈ విలేకరితో అన్నారు.

### ఇంట్లో ఈగలమోత

శ్రీ వెంగళరావు బయట పల్లకి మోతలో తెలుగుదేశాన్ని చీకాకుపరుస్తుంటే పార్టీలో మాత్రం ఆయనను గోతుల తవ్వడానికి క్రమపద్ధతిలో యత్నాలు ప్రారంభమైనాయి. తన అను

—కొరవ 7వ పేజీలో

# పినాకిని తీరం

## వ్యాఖ్యారహితంగా...

ప్రతిపక్ష నాయకులొకరు మాట్లాడుతూ ఇట్లన్నారు: "నెల్లూరు జిల్లాలో జనార్దనరెడ్డిని విస్మరించి కాంగ్రెస్ విషయాన్నిగూర్చి ఆలోచించడం కంటే అవాస్తవికత, అవజ్ఞత మరొకటుండదు"

—ఇదీ ఆమాట. ఈ నాయకుడు కాంగ్రెస్‌కు ప్రత్యక్ష విరోధి! [illegible] జనార్దనరెడ్డిని తిట్టినతిట్టు తిట్టకుండా తిట్టిననాయకుడు. ఒకరడిగితే అతని నోటివెంట వచ్చిన వ్యాఖ్యకాదిది; జరుగుతున్న తంతునంతా పత్రికలలో నిశితంగా పరిశీలిస్తున్నారేమో. స్వచ్ఛందంగానే వ్యాఖ్యానించారు.

ఆ నాయకుడు మాటల సందర్భంగా మరో విషయాన్నికూడా ప్రస్తావించారు. "వెంగళరావుగారి ముఖ్యమంత్రిత్వంలో తప్ప అంతకుముందు కాని, ఆ తర్వాత కాని ఆత్మకూరు, ఉదయగిరి తాలూకాలలో అభివృద్ధే జరగలేదని ఆనం వెంకటరెడ్డిగారు సెలవిచ్చారు. వెంగళరావుగారి హయాంలోనూ, ఆ తర్వాతి సంగతి అట్టుంచండి; అంతకుముందు ఆ రెండు తాలూకాలను ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలించినవారు వెంకటరెడ్డి. అంతకుముందు [illegible] అభివృద్ధి జరగలేదని తానే చెప్పడమంటే తానేమీ చేయలేదని ఒప్పుకోవడమే గదా అర్థం? అది ఆయనకు అవమానాన్ని చేకూర్చే విషయంకాదా" అన్నారు ఆ నాయకుడు.

ప్రక్కనే వున్న ఒక కాంగ్రెసాయన అందుకొని అన్నాడు గదా- "వున్న మానం ఇదివరకే పోయింది. కొత్తగా పోవడానికి ఏమైనా మిగిలివుంటేగదా!"

అందులో నాది ఒక్క మాట కాని, ఒక్క అక్షరం వ్యాఖ్య కాని లేదు, నమ్మండి నమ్మకపోండి!

## వెంకటగిరి చిన్నరాజా

## చిటికేశాడా?

వెంకటగిరి చిన్నరాజా, అంటే వెలుగోటి గోపాలకృష్ణ యాచేంద్రగారు మళ్లీ మరొక చిటికేశారా? వేసే వుద్దేశ్యమేమైనా వుందా? చిటికేయడమంటే నా వుద్దేశ్యం రాజకీయంగా 'ఫ్లిప్' ఇవ్వడమని.

గోపాలకృష్ణయ్యగారికి రాజకీయ రంగంలో ఒక ముద్దుపేరుంది. పాపం, ఆయన తాను జమీందారుననుకోకుండా భేషజం గీషజం లేకుండా సామాన్యులతో కూడా కలిసిమెలిసిపోయే మంచి వ్యక్తి. కాని మాటలలో, నడకతో నిలకడలేనందువల్ల కాబోలు ఆయన్ను ముద్దుపేరుతో పిలుస్తారేమో ననిపిస్తుంది ఆ గొడవంతా నాకెందుకు.

నేను ఇప్పుడు ఇక్కడ మళ్ళీ చెప్పదలచింది గోపాలకృష్ణయ్యగారు మరొకమారు అవకాశవాది అనిపించుకోబోతున్నారా అని? మొన్న వెంకటగిరి మిత్రులొకరన్నారు. "గోపాలకృష్ణయ్య తాను కాంగ్రెసేనని చెప్పుకుంటున్నారట" అని. ఆ మాటకు నాకు ఆశ్చర్యం కలగలేదు కాని, ఇంతొందరలో అంతగా విగ్గు విడుస్తాడా అనే సందేహం కలిగింది కాని, హైదరాబాదు నుండి విన్న మొన్న మరొకవార్త — గోపాలకృష్ణయ్యగారు కొత్త పి.సి.సి. అధ్యక్షుడు శ్రీ వెంగళరావుగారిని దర్శించుకున్నారని తెలిసింది. గోపాలకృష్ణయ్య —తాను కాంగ్రెసేనన్నాడట అన్న వెంకటగిరి వార్తకు ఈ హైదరాబాదు సంఘటనను జోడిస్తే, ఏమని వూహించదగివుంటుంది? వెంగళరావుగారు కాంగ్రెస్ అధ్యక్షులయ్యారు కాబట్టి, తిరిగా ఆయన కాంగ్రెస్ పునః ప్రవేశం చేయవచ్చునేమో ననుకోవచ్చు గదా?

గోపాలకృష్ణయ్యగారు ఇప్పటికి పార్టీలపరంగా, వర్గాలపరంగా ఎన్ని పల్టీలు కొట్టాడో, ఎన్నిపిల్లి గంతులు వేశాడో చెప్పలేము. లేటెస్టు మొన్న మార్చి ఎన్నికలలో వెంకటగిరి నియోజకవర్గంలో తెలుగుదేశం అభ్యర్థి అయిన తన అన్నకుమారునికి పనిచేశారు.

అవకాశవాదులు ప్రజల దృష్టిలో విలువను కోల్పోతారు. వారి మాటకు ప్రజలలో గడ్డిపరకకు వుండే విలువ కూడా వుండదు. అందువల్ల ఇటువంటి వారు పో[illegible]రే అని దిగులుకాని వచ్చా అనే సంశయం కాని వుండవలసిన అవసరం [illegible], ఇటువంటివన్నీ పేరుకున్న చెల్లని కాసులు! కాని ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ వెంగళరావుగారు తాను త్రాసు చేతపట్టుకొని వర్గరహితమనిపించుకుందామని ఇటువంటి సరుకకంతా స్థానమిస్తే, కాంగ్రెస్ వాదులలో వుత్సాహం నీరుగారిపోతుంది; సంస్థ దుర్బలమైపోతుంది!

## డాక్టర్లకు

## కోపం వచ్చింది!

నెల్లూరు డాక్టర్లకు కోపం వచ్చిపట్టింది. ఎందుకంటారా? ఆరోగ్యశాఖామాత్యులు డాక్టర్ కోటేశ్వరరావు ప్రయివేటు నర్సింగ్‌హోంలకు రిజిస్ట్రేషను పద్ధతి ప్రవేశపెట్టడకు ప్రభుత్వం ఆలోచిస్తున్నదని పత్రికా ప్రకటన చేశారు; దానికి డాక్టర్లందరూ ఆయన్ను గయ్‌మని పట్టుకున్నారు.

నెల్లూరు మెడికల్ అసోసియేషన్ వారు మొదటగా ఆయన ప్రకటనను నిరసించారు; ఈ రిజిస్ట్రేషన్ పద్ధతి వైద్యుల, ప్రజల ప్రాథమిక హక్కులపై దెబ్బతీయడం లాంటిదన్నారు; నర్సింగ్‌హోంలను వ్యాపార సంస్థలుగా పరిగణించరాదన్నారు; గ్రామీణ ప్రాంతాలలో ఆస్పత్రులు నిర్వహించే జూనియర్ డాక్టర్లకు ఈ ప్రతిపాదన గొడ్డలిపెట్టులాంటిదన్నారు.

ఇవన్నీ చీవాట్లు, శాపనార్థాలు. వీటన్నిటిల్లో రెండు మంచి అంశాలు లేకపోలేదు. వాటిలో ఒకటి ప్రభుత్వాస్పత్రుల నిర్వహణను సరిదిద్దితే, ప్రయివేటు నర్సింగుహోంలనుగూర్చి ఇంత ప్రయాసపడనక్కరలేదనేదొకటి, రెండవది — వైద్యకళాశాలలను నిర్వహించే పరిశీలవైద్యులను శాశ్వతులను చేయాలన్నది రెండవది, మొదటిది అక్షరాలా నిజం; రెండవది ఖచ్చితంగా అవసరం.

కాని ఒక ప్రశ్న వేస్తున్నందుకు డాక్టర్లు క్షమించాలి. నర్సింగ్‌హోంలు వ్యాపారసంస్థలు కాక, సేవాసదనాలంటారా? డాక్టర్లందరినీ సేవామూర్తులుగా భావించమంటారా? మినహాయింపు లున్నాయంటే ఎవరైనా అంగీకరించి తీరాలి. కాని ప్రయివేటు నర్సింగ్‌హోంలు ఎట్లున్నా ప్రభుత్వం పట్టించుకోవడం అన్యాయం, అపచారం అంటే వొప్పుకోలేమండీ!

## సమాచారశాఖ

## సార్థకత

డి.పి.ఆర్.ఓ. శ్రీ వై. వి. రత్నం ఆధ్వర్యంలో నెల్లూరు సమాచారశాఖ తనపేరును సార్థకంచేసుకున్నదని చెప్పడానికి సంతోషిస్తున్నాను.

సమాచారమంటే ప్రభుత్వానికి సంబంధించిన వార్త లేకాదుగదా! [illegible] కాదుగదా? మంత్రుల పర్యటనలు, సభలు, సంస్థాపనల ప్రారంభోత్సవాలే కాదుగదా? పార్టీ అంటే అధికారంలో వుండేదే పార్టీ కాదుగదా? ఈ సూక్ష్మాన్ని శ్రీ వెంకటరత్నం గ్రహించినట్లున్నారు. జూన్ 14, 15 తేదులలో సి.పి.ఐ.కి అనుబంధితమైన రైతు సభ కోవూరులో జరుగుతుందని, అందులో [illegible]సభ్యులైన శ్రీ సి.హెచ్. రాజేశ్వరరావు, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ప్రభృతులు వుపన్యసిస్తారని జిల్లా సమాచార కార్యాలయంనుంచి పత్రికలకు ఒక వార్త అందింది. నా అనుభవంలో ఒక అనధికార సభనుగూర్చి సమాచారశాఖ బులిటిన్ జారీచేయడం ఇదే మొట్టమొదటిసారి. అందువల్లనే నాకు ఆశ్చర్యం కలిగింది! పత్రికనే సమాచారశాఖపేరు సార్థకమైందని సంతోషంకూడా కలిగిందనుకోండి.

నెల్లూరు సమాచారశాఖ ఈ సాంప్రదాయాన్ని ప్రతి అనధికారసభకు, ప్రకార్యక్రమానికి వర్తింపచేయగలదని ఆశిస్తాము. లేక ఇటువంటి వార్తలివ్వడం ఈసభతోనే ఆఖరైతే, దాన్ని పేరు[illegible] భావించవలసివస్తుంది.

## రామరామ

## ఇదేమి ఫలితం!

నెల్లూరు టవున్‌లో 21 హైస్కూళ్లుంటే అందులో ఎనిమిది హైస్కూళ్లు మాత్రం రాష్ట్ర సగటు ఫలితమైన 40 శాతం కంటే ఎక్కువ ఫలితాన్ని పొందగలిగాయి. ఇరవైశాతం పాస్ కూడా లేని స్కూళ్ళు ఐదు. ఆ మహాఘనత వహించిన స్కూళ్ళు ఏవన్నా అంటే... సెయింట్ పీటర్స్ (19 శాతం), ఆర్.ఎస్.ఆర్.- మూలాపేట (18 శాతం) శ్రీ కస్తూరి దేవి, రంగనాయకులపేట మునిసిపల్ హైస్కూలు, దర్గామిట్ట జి.స. హైస్కూలు.. ఈ మూడిటిశాతం 17. అక్షరాలా పదిహే[illegible]!

ఈ మూడింటిలో రంగనాయకులపేట గొప్ప అభివృద్ధి అనే చెప్పాలి! 1984లో దాని ఫలితం 7 శాతమే; ఈసంవత్సరం పదిశాతం ఎక్కువ. కస్తూరిదేవి విద్యాలయానిది గతసంవత్సరంకంటే దిగనాసి; 1984లో 19 శాతమైతే ఇప్పుడు 17 శాతం. దర్గామిట్ట హైస్కూలుది 1984 ఫలితం దొరకలేదు; 1981లో 26 శాతమైతే ఈఏడు 17 శాతం!

గర్ల్స్ హైస్కూల్సులో కస్తూరిదేవిదే అధ్వాన్నం. యాభైశాతం ఫలితం వచ్చిందని ఈ పాఠశాలతో ఇప్పటి[illegible] వినలేదు, ఎవరిదిలోపం? ఎక్కడలోపం? ఎందులోనూ ప్రత్యేకత లేకుంటే తే[illegible] పోయింది, సాధాఫలితంకూడా అతిహీనం కావడం అవమానకరంగానే వుంటుంది. పేరుగొప్ప వూరుదిబ్బ అన్నట్లు కస్తూరి[illegible] పేరు, భూరి భవనాలు, విశాలమైన [illegible] కాంపౌండు, కళావిలయం కావం[illegible] కళ్యాణమండపమైన ఆడిటోరియం[illegible] ఇన్ని హంగులుండి ఇంత పేదఫలితాన్ని పొందడం సంస్థకు కళంకమే! ఎదుగు బొదుగు లేకుండా నాలుగు దశాబ్దాల నుండి పుట్టినాటికి పెద్దగా పెరిగేవాటి[illegible] చిన్నగా వుంటున్న ఈ విద్యాలయం వుండీ ఒకటే లేకా ఒకటేకాదా? ప్రా[illegible]నని అయానవదకుండా దానికి నెల్లూరులో ఒక విశిష్టతను చేకూర్చడానికి ప్రయత్నించవలసిందిగా మేనేజ్‌మెంటుకు నా మనవి.

దర్గామిట్టలోని జి.స. హైస్కూలును విశాలనుండి స్కూలని ముద్దుగా పిల్చుకోవచ్చు. అక్కడవుండే సిబ్బంది అంత[illegible] విశాలమంలో వున్న వరుకే. అటువంటి స్కూలులో 17 శాతం కంటే ఎక్కువ ఫలితాన్ని ఆశించగలమా? శ్రీ బొల్ల శేషారెడ్డి తన తండ్రి పేరుమీ[illegible] అంతపెద్ద భవనాన్ని కట్టించి యిచ్చా[illegible]దంటే, ఆయన్ను తెలిసినవారందరికీ ప్రపంచ వింతల్లో ఒకవింత అనిపించింది. అటువంటి విలువైన దానం ఇటువంటి అధ్వాన్నపు ఫలితంతో వ్యర్థం కావడం సహించరానివిషయం. ఈసారి జి.స. సమావేశంలో సభ్యులు ఈ స్కూలు దుస్థితినిగూర్చి ప్రస్తావించడం బాగుంటుంది.

# జమీన్‌రైతు

## రెండురోజుల సెలవు

కేంద్ర ప్రభుత్వోద్యోగులకేకాక, మన రాష్ట్ర ప్రభుత్వోద్యోగులకు కూడా జూలై 1 తేది నుండి వారానికి రెండురోజుల సెలవు; అంటే ఇక నుండి వారంలో ఐదురోజులు పనిచేసి, రెండురోజులు హాయిగా ఇంటివద్ద విశ్రాంతి తీసుకోవచ్చు.

వారానికి ఒక్కరోజు కాకుండా రెండురోజుల సెలవివ్వవలసిన అవసరం ఏమి కలిగింది? ఉద్యోగుల కోర్కెమీద చేశారనుకోడానికి, రిటైరింగు వయస్సు అరవైఏళ్లు చేసినా పనిచేయడానికి సిద్ధంగా వున్న ఉద్యోగులు, వారానికి రెండురోజుల విశ్రాంతిని కోరుతారని మేమనుకోము. ప్రభుత్వ కార్యాలయాలకు వరుసగా రెండు రోజుల సెలవనేది ప్రజలకు తీరని అసౌకర్యం; అందువల్ల వారూ కోరరు. ప్రభుత్వమే వూహాజనితమైన కారణాలతో తనకైతానే ఈ నిర్ణయం తీసుకొని వుండాలి.

ఉద్యోగులకు రెండురోజులు విశ్రాంతినొసగితే పనిసామర్థ్యం పెరుగుతుందని ప్రభుత్వాభిమతం; అధికార్లు సెలవురోజుల్లో తిరగకుండా కట్టిడి ప్రభుత్వవాహనాల ఇంధనం పొదుపవుతుందని ఒకపిచ్చి; ఆఫీసులకు ప్రజల రాకపోకలు తగ్గి దానివల్ల రవాణారద్దీ కొంతవరకైనా పరిమితమవుతుందని మరొక అభిప్రాయం, ఇటువంటి పిచ్చిఅభిప్రాయాలు భ్రమలు ఎన్నోకలసి ప్రభుత్వం ఈ రెండురోజుల సెలవు నిర్ణయానికి దారితీసివుంటుంది.

కాని ప్రభుత్వం ఆశించే ఈ ఫలితాలు లభిస్తాయని ఆశించలేము. శ్రమపడి పనిచేయగలిగితే, ఆఫీసు పనివేళలను వృధా కాలయాపనతో గడపకుండా సద్వినియోగం చేయగలిగితే, జపాను వంటి దేశాలలోవలె ప్రతి క్షణాన్ని విలువైనదిగా భావించి తమ కార్యకలాపాలు నిర్వర్తించగలిగితే వారానికి రెండురోజుల సెలవివ్వడంవల్ల నష్టంలేదు సరిగదా! అవిధంగా ఇవ్వడం అవసరం అవుతుందికూడా. మనదేశంలో ఈనాడు అటువంటి పరిస్థితిలేదు, అద్యతన భావిలో అవిధంగా శ్రమపడి పనిచేసేతత్వం అలవరచుకుంటారనే విశ్వాసంకూడా కలగటంలేదు.

అదనంగా ఒకరోజు సెలవివ్వడంవల్ల వాహనాల తిరుగుడు తగ్గుతుందని, ఇంధనం పొదుపు జరుగుతుందనుకోవడంకూడా పొరపాటే! వరుసగా రెండురోజుల సెలవువల్ల దూరపు ప్రయాణాలు ఎక్కువై, పెట్రోలు, డీజిల్ ఖర్చు మరింతగా పెరిగితీరుతుంది, రవాణారద్దీని తగ్గించడంకోసం ప్రజల అవసరాలను పనులను ఇబ్బందిపెట్టడం ఎంతవరకు విజ్ఞతవుతుందో ప్రభుత్వానికే తెలియాలి.

వారానికి రెండురోజుల సెలవనేది ఈనాడు కొత్తదేమీకాదు; ఆరేడేళ్ళ క్రితం డాక్టరు చెన్నారెడ్డి ప్రయోగంలో పెట్టి చూచారు. దీనివల్ల ప్రభుత్వం ఆశించిన ఫలితాలేవీ లభించకపోగా, నిత్యపాలనా కార్యకలాపాలు కుంటుపడి, ప్రజలలో అసంతృప్తి బయలుదేరింది, అందువల్ల చెన్నారెడ్డిగారు అనాడు ఆ ప్రయోగాన్ని మానుకోకతప్పలేదు. నేడు తిరుగా ఆ పద్ధతిని ప్రవేశపెట్ట దలచిన రాష్ట్ర ప్రభుత్వం, పాత అనుభవాలను ఫలితాలను ఒకసారి పరిశీలించి తుది నిర్ణయం తీసుకోవడం ఉచితంగా వుంటుంది.

# ఉదయగిరి తాలూకా అభివృద్ధి ఎక్కువగా జరిగింది 1978 తర్వాతే!

వెంగళరావు హయాంలోతప్ప, ఇతరత్రా ఎప్పుడూ ఆత్మకూరు ఉదయగిరి తాలూకాలలో ఏ అభివృద్ధి జరగలేదని శ్రీ ఆనం వ జీ రెడ్డి చేసిన ప్రకటన అసత్యకరంగావుంది. ఆయన ఈతాలూకా సంగతులు తెలిసీ తెలియక ఈ ప్రకటన చేసినట్లున్నారు.

గండిపాలెం ప్రాజెక్టు వెంగళరావు హయాంలో ప్రారంభించిన విషయం వాస్తవమే. దానికి ప్రారంభంలో వ్యక్తిగా ఏ.సి. సుబ్బారెడ్డి కృషి ఇందులో ఎంతో వుంది.

ఉదయగిరిలో ఏమైనా అభివృద్ధి జరిగితే, అది 1978 నుంచి 1985 మధ్య కాలంలోనే జరిగింది. ఆకాలంలోనే ప్రపంచబ్యాంకు ఆర్థిక సహాయంతో 14 చెరువులుకూడా నిర్మించబడినాయి.

30 వేల రూపాయల వ్యయంతో సందవరం దగ్గర బొగ్గేరుపై, ఉదయగిరి సీతారామపురం పిల్లాపేరుపైన వంతెనలు నిర్మించిందీ ఈ కాలంలోనే.

ఉదయగిరి చీకటికోనలో వెలుగులు ప్రసాదించిన విద్యుచ్ఛక్తి క్లస్టర్ స్కీం వచ్చిందికూడా ఈ మధ్యకాలానే. మొదట కోటి 7లక్షలు. 1988వ సంవత్సరంలో మరొక కోటి 17 లక్షలు మంజూరై అసంఖ్యాకమైన గ్రామాలకు ఈ పథకం వల్ల కరెంటుసౌకర్యం ఏర్పడింది.

83-85 సంవత్సరాల మధ్యకాలంలో రెండు కాలేజీలు, ఒక జూనియర్ కాలేజీ

### జనవాణి

పెరిగాయి 7 హైస్కూళ్ళనెలకొన్నాయి. 120 ఎలిమెంటరీ స్కూళ్ళకు భవనాలు వచ్చాయి. 20 లక్షల ఖర్చుతో ఉదయగిరిలో పశువైద్యశాల నిర్మాణం జరిగింది. ఉదయగిరిలోనే 8 లక్షలతో రక్షితమంచి నీటి పథకం నిర్మించబడింది. తాలూకాలో కొత్తగా 5 హాస్టళ్ళు, 5 బ్యాంకు శాఖలు ఏర్పడ్డాయి. అనేక గ్రామాలకు

—కొరవ 10వ పేజీలో



## జమీన్‌రైతు
28-6-35 సంచికనుండి

### నెల్లూరు డైరీ

వెంకటగిరి మహాసభలో ప్రథమమున అల్లరికి ప్రారంభోత్సవము జరిపి కషుసంటివారున్నూ, సంస్థాన పబ్లిసిటీ ఆఫీసరుగారి సోదరులున్నూ వెంకటగిరి హైస్కూలు టీచరుగా ఉన్నూ, తదనంతరం జిల్లా సందాయితీ ఆఫీసరుగా ఆవకతవకలు చేసిన చంగగారి రామనాథంగారు పంచాయితీ ఆఫీసరుగా కలువాయికి విజిట్ చేసినప్పుడు పంచాయతీ క్యాష్ బొక్కులో నవంబరు 4 తేదిన చేర్చాలని చేసి, గెస్టుహౌస్‌లో నవంబరు 6 తేది చేసినరటనే, బత్తా బిల్లులో ఏతేది నేరారో కొంచెం చిత్తగిస్తారా జిల్లాబోర్డువారు.

○○○

వెంకటగిరి ఎస్టేటువారు సిల్వర్ జూబిలీ పండుగకు విరాళం తెప్పించుకొని, రైతులకు లక్షరుపాల రివిషన్ విస్తానని ప్రకటించి యింతవరకూ ఈ వాగ్దాన నిర్వహణానికి అంకురార్పణ లేకుండడానికి కారణ మేమంటారు?

○○○

### 50 ఏళ్ల క్రితం ఈవారం

ప్రభకు రు 2000-00 లు ధరావత్తు

మచలీపట్నం నుండి ప్రచురింపబడుచుండు "ప్రభ" యను మాసపత్రికయందు అశ్లీలకరములగు వ్యాసములు గలవని ప్రభుత్వము వారు రు 2000-0-0 ధరావత్తు ప్రకాశకులవద్దనుండి కోరిరి. త్వరలోనే ధరావత్తుసైకము చెల్లించి పత్రికను సాగింతురని తెలియుచున్నది.

○○○

బుచ్చిరెడ్డిపాలెంలోని శ్రీకోదండరామస్వామి దేవాలయం నిర్వహణపై ఒక వార్త.

నెల్లూరు మండలంములోని దేవాలయములలో విది సుప్రసిద్ధమైనది. దీనికి లక్షలు విలువగల భూములు గలవు. సంవత్సరమునకు సుమారు 20 000 రూపాయలకు తక్కువ లేకుండా ఆదాయము వచ్చుచున్నది.

"ఈమేనేజిమెంటులో ఎన్నో అబంధతలు తేలుచున్నవి. కావలసినంత ద్రవ్యముంచుకొని దేవాలయము కొరకు ఋణములు వడ్డీకి తీయుట చిత్రమైన విషయము.

"ఇంతగొప్ప దేవాలయము విదారణ అబంధరస్థితిలో నుండుట గమనించి, దేవాలయ బోర్డువారు లెక్కలు సరిగా నుంచవలసినట్లును! దేవాలయ దిట్టము తయారుచేయవలసినట్లును, శేషించిన ద్రవ్యమును బ్యాంకులో నుంచవలసినట్లును ఆర్డరు చేసిరిగాని, ఈ ఆర్డరును ఏమాత్రము అమలులో నుంచినట్లులేదు."

# కడగండ్ల నిలయంగా వున్న కందుకూరు ప్రభుత్వాస్పత్రి

ఎన్నేళ్ళు గడిచినా ఎదుగూ బొదుగూ ఎరుగని ఊర్ల జాబితాను ఎవరైనా తయారు చేస్తే, నెల్లూరు జిల్లా ప్రథమస్థానం కొట్టేస్తుంది. కందుకూరు పేరుకు రెవిన్యూ డివిజన్ కేంద్రంగా వున్నా, పల్లె పట్నం కూడా కాని ఈ వూరి వి పూర్వజన్మలో చేసిన పాపమో, ఎవరో పెట్టిన శాపమో పట్టిపీడిస్తున్నట్లుంటాయి.

రవాణా వసతులు శరవేగంతో అభివృద్ధి చెందుతున్న ఈరోజుల్లో, కందుకూరుకు రావడంకంటే కాశీకి పోవడం సులభంగా వుంటుందని, పరిసర గ్రామ ప్రజలు భావిస్తున్నారంటే, ఇక ఇక్కడి అభివృద్ధి ఎంతైనా ఊహించుకోవచ్చు. కందుకూరు చుట్టూ చిల్లర ఏర్లు చిన్న చిన్న వాగులు అనేకంగా వున్నాయి. వాటికి వంతెనలు కట్టిన పాపాన ఎవరూ పోలేదు. ఎంతలకాస్తే గుక్క నీళ్ళు దొరకని ఈ ఎడారి ప్రదేశంతో, వానలు వస్తాయంటే పలు గ్రామాలకు సంబంధాలు తెగిపోతాయి.

కందుకూరు దౌర్భాగ్యానికి సజీవ చిహ్నం, తాలూకా ప్రభుత్వ ఆస్పత్రి అనబడే శిథిల గృహం. ఎనభయ్యేళ్ళ కితం 1909 లో బ్రిటీషు దొరలు ఏ రాయి ఎక్కడ పెట్టారో, ఇప్పటికీ అక్కడనే కదలకుండా వున్నాయి. ఈమధ్య కాలంలో ఎవరూనున్నంకూడా కొట్టిఎరుగని వట్లు దరిద్రం కారుతూవుంటుంది; ఈడివిజన్ అంతటికీ కలిపి ఒకేఒక్క పెద్దఆస్పత్రి ఇది. తప్పితే ఒంగోలు పోవాలి. అదీ అంతంత మాత్రమే.

**మా విలేఖరి**

పందలాది గ్రామాల ప్రజలకు అవసరాలు తీర్చవలసిన ఈ ఆస్పత్రి ఎంత దౌర్భాగ్యంగా వుందో చూసి తరించాల్సిందేకాని, చెప్పతరంకాదు.

చినుకు వాన పడితే చాలు, లోపలంతా రొచ్చురొచ్చయిపోతుంది; కొన్ని గదుల లోకి సూర్యచంద్రులు నిరాటంకంగా వచ్చి పోతుంటారు. అధ్వాన్నపు గదులు కూడా క్రిక్కిరిసి వుండడంతో తరచు రోగులు చెట్ల క్రింద తలదాచుకుంటున్నారు.

ఎందరెల్లో సత్కారులవారికి దయకల్గి ఇటీవలే దీనికి అనుబంధంగా మరొక భవనం కట్టడానికి పూనుకున్నారు. అయితే ఇతర సౌకర్యాలు మాత్రం పూజ్యంగా వున్నాయి. ఎక్స్‌రే తియ్యాలన్నా వసతిలేదిక్కడ. ఒంగోలు పోవలసిందే! పరిస్థితి ఎంతదౌర్భాగ్యంగా వుందంటే, ఈ ఆస్పత్రిలో మూడు ఫేనుల కరెంటు సౌకర్యంకూడా లేదట. ఫలితంగా అవసరమైన సామగ్రిని బాయిల్ చేయాలన్నా వీలులేకుండా పోతూంటది. ఇక ఆపరేషన్ల సంగతి సరేసరి!

డివిజన్ కేంద్రమంతటికీ కలిసి చెప్పుకోదగినవున్న ఒకే ఒక్క ఆస్పత్రి ఇంత అధ్వాన్నంగావున్నా అధికారులు కాని, రాజకీయవాదులు పట్టించుకోక పోవడం శోచనీయం.

విజానికి దీని అభివృద్ధితోపాటుగా తాలూకాలో మరికొన్ని ప్రధాన కేంద్రాల లో కూడా ఆరోగ్య, వైద్యవసతులను విస్తరించవలసిన అవసరంవుంది. రోడ్డు, బస్సు సౌకర్యాలు సక్రమంగా లేక పోవడంతోవున్న ఈ ఒక్కదానినికూడా గ్రామీణులు వినియోగించుకోలేక పోతున్నారు.

—కొనసా 10వ పేజీలో



# మండలాలు-గ్రామాలు

**కావలి**

కావలి టిట్ వన్, టిట్ టు (రూరల్). అనెమడుగు, రుద్రకోట, చెన్నాయపాలెం, మద్దూరుపాడు, మూసునూరు, మన్నంగి దిన్నె, తుమ్మలపెంట, తాళ్ళపాలెం, బుడమగుంట, గౌరవరం, చలంచర్ల, కావలి మునిసిపాలిటీ, చింతలపాలెం, కొత్తపల్లి.

మొత్తం 16 గ్రామాలు.

**జలదంకి**

చోడవరం, కేశవరం, గట్టుపల్లి, జమ్మలపాలెం, జలదంకి, బ్రాహ్మణక్రాక, అన్నవరం, చిన్నక్రాక, కోదండరామపురం, సోమవరప్పాడు, కృష్ణాపాడు, చామదల.

మొత్తం 12 గ్రామాలు.

**బోగోలు**

బిట్రగుంట, సాంబశివపురం, ముంగమూరు, జువ్వలదిన్నె, మల్లాయపాలెం, నిద్దవరం, వెంకటేశుపాలెం, అల్లిమడుగు, ఉమామహేశ్వరపురం, కోవూరుపల్లి, బోగోలు, కావ్యూరు, జక్కేపల్లి గూడూరు.

మొత్తం 12 గ్రామాలు.

**కొండాపురం**

ఇవకదామెర్ల, కస్తూరినాయుడుపల్లె, వెలిగండ్ల, తూర్పు యర్రబల్లి, చింతలదీవి, మర్రిగుంట, గుడవల్లూరు (కొండాపురం), నేకునాంపేట, సాయిపేట, భీమవరప్పాడు, కుమార వెంకటాపురం, సత్యవోలు, సాకపల్లె, మల్లవరప్పాడు, గానుగపెంట, ఆదిమూర్తిపురం, తూర్పు బ్రాహ్మణపల్లె, రామానుజాపురం, తుంగవారిపాలెం, కొమ్మి, చల్లగిరిగల, గొట్టిగుండాల, గరిమెన పెంట, తూర్పు జింగలపల్లె, శెట్టిపాలెం, ఉరకొట్లపల్లె.

మొత్తం 28 గ్రామాలు.

**కలిగిరి**

తెల్లపాడు, చిన్నన్నలూరు, రావులకొల్లు, దూబగుంట, క్రాకుటూరు, కుమ్మరకొండూరు, పర్లకోట, లక్ష్మీపురం, అనంతపురం, గడ్డదొవ, సిద్ధనకొండూరు, పెదకొండూరు, కలిగిరి, వెంకటసపాలెం, నాగసముద్రం, సీతన్న

**కావలి, ఉదయగిరి, వింజమూరు, ఆత్మకూరు పొదలకూరు తాలూకాల వివరం**

కొల్లు, పెద్దన్నలూరు, వెలగపాడు, కావలిముస్తాపురం, కొత్తపేట.

మొత్తం 21 గ్రామాలు.

**వింజమూరు**

జనార్దనపురం, చాకలకొండ, ఊటుకూరు, కాటేపల్లి, తమిడపాడు, నందిగుంట, రావిపాడు, వింజమూరు, గుండెమడకల, శంకవరం, బొక్కా పురం, చంద్రపడియ, చింతలపాలెం, అతసీటి కిస్తీపురం, నల్లగొండ.

మొత్తం 15 గ్రామాలు

**మర్రిపాడు**

బూదవాడ, కంపసముద్రం, దాచూరు, బ్రాహ్మణపల్లె, పెగళ్ళపాడు, చిలకపాడు, పడిగినేనిపల్లి, నెర్దనంపాడు, పంచవరం, భీమవరం, అల్లంపాడు (మర్రిపాడు మజరా) పల్లవోలు, ఇల్లపాడు, నాగినేనిగుంట, సింగపల్లి.

—కొనసా 11వ పేజీలో

# వైదిక విద్యకు కేంద్రాలు-బ్రాహ్మణక్రాక, చినక్రాక

కావలి తాలూకాలో బ్రాహ్మణక్రాక, చినక్రాక అనే రెండు గ్రామాలున్నాయి. బ్రాహ్మణక్రాక గ్రామాన్ని విజయనగర సామ్రాజ్యాన్నిపాలించిన రెండవ హరిహరరాయలు (క్రీ.శ. 1377-1404) తమమంత్రి, బుక్కరాయల ముక్తికొరకు నానాశాఖలకు, నానాగోత్ర సూత్రాలకు సంబంధించిన వేదశాస్త్ర పారంగతులగు బ్రాహ్మణులకు శాలివాహనశకం 1298 సంవత్సరంలో (క్రీ.శ. 1376) బుక్కరాయ పురమని ప్రతినామంపెట్టి, బ్రాహ్మణక్రాక గ్రామాన్ని, సర్వ సామ్యములతో, అష్టభోగములతో, ఆచంద్రతారకంగా సమభవించుటకొరకై ఒక తామ్రశాసనాన్ని యిచ్చియున్నారు. ఈ శాసనాన్ని కావలి శ్రీ కేసరి సుందర రామశర్మ కనుగొని, విక్రమ సింహపురి మండల సర్వస్వంలో ప్రకటించి వున్నారు.

క్రాక అంటే ఏమి?

శాసన శ్లోకాలలో

క్రాకు సలాంఛిత మగ్రహారం (శ్లో-20)

కాకుర్విభాతి పరితో

జలపంక్తి యామ్నే (శ్లో-21)

అని వ్యవహరించియున్నారు. పై శ్లోకాలనుబట్టి క్రాకు అనే సామాన్య గ్రామాన్ని సలాంఛితముగా చేసి దానంచేసినట్లు విశదమవుతుంది.

**ఊరు-పేరు**
**తాపింటపర్తి కృష్ణరావ**

క్రేతాగ్నులంచే (ఆహవనీయము, దక్షిణాగ్ని, గార్హపత్యము) క్రాగు గృహములు కల్గియుండుటచేత 'క్రాక' అని వ్యవహారం కల్గియుండవచ్చును, ఇతర శాసనాలలో బ్రాహ్మణకాక, బ్రాహ్మణకాక అని పాఠబడి వున్నది. (నె. జి. శాసన సంపుటములు)

చినకాక (చినక్రాక)

ఈ గ్రామ నామాన్నిగూర్చి శాసనాధారములు లభించినప్పటికీ, పైఅర్థంలో యీ గ్రామంలోను క్రేతాగ్నులంచే క్రాగు

—కొనసా 11వ పేజీలో

# తెలుగుదేశం సభ్యత్వానికి అధికార్ల దండకాలు?

తెలుగుదేశం సభ్యత్వ పునరుద్ధరణ కార్యక్రమమనబడే ప్రహసనం జిల్లా అంతటా ఎట్లా జరుగుతుందో తెలియదు కాని, గూడూరులో మాత్రం అది కార్మికులకు నేరుగా వడ్డించేది అలా జరిగి పోయింది.

చక్రవర్తి పదవున కప్పం గుంజడానికి సామంతరాజ్యాలకొచ్చిన 'దండు' వలె, తెలుగుదేశం జిల్లా నాయకులందరూ ప్రస్తుతం గ్రామాలపైకి దండెత్తుతున్నారు; ప్రతి నాయకుడికి, అన్నగారి అల్లుడుగారు ఇంతింతని 'కోటాలు' నిర్ణయించారట; జిల్లా మొత్తం మీద 'లక్ష్యం' ఎంతో తెలియదు కాని ఒక్కొక్క తాలూకాకు లక్షరూపాయలకు పైబడిన రసీదు పుస్తకాలు సరఫరా చేయబడినాయని తెలుస్తున్నది.

ఏ గ్రామంలో నూ తమకు తాముగా, స్వచ్ఛందంగా రెండు రూపాయలు చెల్లించి, సభ్యత్వం తీసుకునే అమాయకులు లేరు. ఒకవైపు తుది గడువు సమీపించడం, ఇంకొకవైపు అమ్ముడుపోని పుస్తకాలు తిరిగి ఇస్తే అవమానకరంగా అమలు కట్టబడతామోనని భయం, ఈ సమస్యకు గూడూరు నాయకులు చక్కటి పరిష్కారం కనిపెట్టారు:

రాజు తలచుకుంటే దెబ్బలకు కొదువా! నేతలు తలచుకుంటే నిధులకు కొరతా? ఇంకేం, గుట్టలు గుట్టలుగా పడి వుండిన రసీదుపుస్తకాలన్నీ అధికార్లకు అప్పచెప్పారట. వాళ్ళమాత్రం చేసేదేం? తప్పించుకోలేరు, ఊళ్ళమీదపడి, వీరు దానికి దగ్గరి ముక్కుపిండి వసూలు చేస్తున్నారు. పైగా, ఈ సభ్యత్వం తీసుకుంటేనే, బ్యాంకు అప్పులు, సబ్సిడీలు వస్తాయని లేనివారికి లేదని ప్రచారం చేస్తున్నారట. గూడూరు టౌన్ హరిజనవాడలో ఇది బహిరంగంగానే జరుగుతోంది.



### కోలగట్ల నీటిపథకం నిరుపయోగం!

రెండు లక్షల రూపాయల ఖర్చుతో ముగ్గురు కాంట్రాక్టర్లు చివర్న డిపార్టుమెంటు రక్షిత మంచినీటి పథకాన్ని పూర్తి చేశారుగాని; గ్రామస్థులకు ఆ నీరు త్రాగే ప్రాప్తం మాత్రం కలుగలేదు. పెన్న గట్టున బావిత్రవ్వి, మోటారు పెట్టి వూళ్లో కట్టిన ఓవర్ హెడ్ టాంకుకు పైపులు

—కావలి శివ పేటీలో

# కౌన్సిల్ ఉప ఎన్నికల కోలాహలం!

కావలి గూడూరు మునిసిపల్ కౌన్సిళ్ళకు జులై 7 తేది రెండు ఉపఎన్నికలు జరగబోతున్నాయి.

గూడూరు రెండవవార్డు కౌన్సిలర్ శ్రీ మస్తాన్ చనిపోవడంవల్ల ఏర్పడిన ఖాళీకి జరిగే ఎన్నికకు ముగ్గురు నామినేషన్లు వేశారు. పి చిన్నయ్య (కాం) దేగపూడి రామచంద్రారెడ్డి (తె. దే.) షేక్ మస్తాన్‌సాహెబ్ (కమ్యూనిస్టు పార్టీ).

కావలిలో 14 వార్డుకు ఎన్నిక జరగబోతుంది. కౌన్సిలర్ శ్రీ నయ్యర్ వలీం, పశుసంవర్ధక శాఖలో ఇంజనీరు ఉద్యోగం సంపాదించడంతో, తన పదవికి రాజీనామా చేశారు, ఆ ఖాళీకి ఇప్పుడు ఉప ఎన్నిక జరుపుతున్నారు.

కౌన్సిళ్ళకు ఇక ఏడాది మించి ఆయవు లేదు. మూణ్ణాళ్ళ ముచ్చటే అని తెలిసినా రెండు ఎన్నికలూ వేడి వేడిగా జరగబోయేట్లున్నాయి.

కావలిలో పోటీలో ఇద్దరేవున్నారు. గతసర్యాయం ఇక్కడినుంచే ఓడిపోయిన అనంద్, అవార్డుచౌకడిపో డీలరు అప్పలం రాధాకృష్ణయ్య! అనంద్ తెలుగుదేశీయుడు, రాధాకృష్ణయ్య కొండసనాయుడు వర్గీయుడు, అంటే ఆయనా తెలుగుదేశం క్రిందే లెక్కేసుకోవాలి. కాంగ్రెస్ నాయకుడు, ఎమ్మెల్యే శ్రీ యానాదిరెడ్డి ఇప్పటి వరకు సైగ్గావున్నారు; రోజులు దగ్గిర పడితే రాధాకృష్ణయ్యకే సహాయం చేస్తారనుకుంటున్నారు. అభ్యర్థులిద్దరు మాత్రం పట్టుదలగా పనిచేస్తున్నారు. ప్రజలలో నే ఆసక్తి కన్పించడంలేదు! ఎవరు గెల్చినా ఒకటే అన్న నిస్పృహ కారణం కావచ్చు.

——

# వెంగమాంబ తిరునాళ్ళ- భక్తులకు నిలువు దోపిడీ!

ఉదయగిరి తాలూకా నర్శింహపల్లె 12 తేది వెంగమాంబ తిరునాళ్ళ జరిగింది. ఆరోజు రాష్ట్రంలోనే కాదు, దేశంలో ఏ మారుమూలవున్నా ఉదయగిరీయులు కూడా వచ్చి తీరవలసిందే; వెంగమాంబకు మొక్కుకుంటె చెల్లింపక పలవించదే తమ వ్యాపారవిజయం అతల్లి చలువేనని వారి నమ్మకం. పూరికే రావటంకాదు! సైకిలు స్కూటరు మొదలు బస్సు లారీవరకు తమకున్న వాహనాలను వెంగమాంబ గుడి చుట్టూ తిప్పుతారట. ఈ సంవత్సరం తిరునాళ్ళకు అక్కడ దెబ్బయ్‌వేలమంది 'భక్తులు' వచ్చారన్నారు. మాజీ ఆంధ్ర సింహం కూడా వచ్చిందో లేదో తెలియదు కాని; మాజీ ఎం. ఎల్. ఎ. వెంకయ్యనాయుడు గారు మాత్రం సందర్శించినట్లున్నారు.

వెంగమాంబ అంటే దేవతేమీకాదు! దేవతగా మారిన క్షత్రియ ఇల్లాలు. ఆ సతను పవిత్రురాలి తిరునాళ్ళకొ రికార్డు డాన్సులట; హేయమైన దృశ్యాలు; దేవుడుగాని, దేవతగాని లేనంతే ఈ రోజుల్లో వాటికి పుణ్యం ప్రాప్తించేదు. ఎక్కడో మారుమూల చీకటిగాల్లో వది మంది ప్రేక్షకులకు ప్రదర్శించే బ్లూ ఫిలింలను నిషేధించే ప్రభుత్వం; బహిరంగంగా వేలాది ప్రజలముందు అంగాంగ ప్రదర్శనంజేసే ఈ నగ్న నృత్యాలను ఎందుకు నిషేధించదు? అది పోనీండి; ఈ రికార్డుడాన్సుల పుణ్యమో, లేక జనంరద్దీవల్లనో కాని, ఈసారి జేబు దొంగతనాలు విపరీతం. కనీసం యాత్రికుల సొమ్ము యాభైవేలయినా చోరగ్రస్తమై వుంటుందని అంచనా. ఈ అదోదిటోముందు వెంగమాంబ భక్తి వెనుకబడి పోయింది!

ఆత్మకూరు విలేఖరి

### ఆత్మకూరు గ్రామాల్లో దొంగల బెడద

ఆత్మకూరు తాలూకా గ్రామాలలో దొంగలముఠా తాకిడి ఇటీవల ఎక్కువగా వుంది. ఎనిమిదిమందిదొంగలముఠా! వివిధ గ్రామాలు దర్శించి, దొరికినవరకు చేజిక్కించుకొని, దొరల్లా తిరుగుతున్నట్లు

—కావలి శివ పేటీలో

సూళ్ళూరుపేట శ్రీ చెంగాళమ్మ పరమేశ్వరి

# బ్రహ్మోత్సవ ఆహ్వానము

**27-6-85 నుండి 3-7-85 వరకు**

అయ్యా! స్వస్తి, శ్రీ క్రోధననామ సంవత్సరం ఆషాఢమాసం శుక్లపక్షం దశమి 27-6-85 తేది నుండి 3-7-85 తేది వరకు నెల్లూరుజిల్లా సూళ్ళూరుపేట శ్రీ చెంగాళమ్మ పరమేశ్వరి తిరనాళ్ళ వైభవోపేతంగా జరుగును భక్తులెల్లరూ విచ్చేసి బ్రహ్మోత్సవములలో పాల్గొని అమ్మవారికి కానుకలు సమర్పించి దైవానుగ్రహాన్ని పొందవలసినదిగా కోరుతున్నాము.

– కార్యక్రమములు –

| | | |
|---|---|---|
| 27-6-85 గురువారం | బలిహరణ | శ్రీ పర్వతరెడ్డి సుంకరరామిరెడ్డి & బ్రదర్స్ పులివెంద్ర |
| 28-6-85 శుక్రవారం సాయంత్రం రాత్రి | మల్లె ఉత్సవం<br>గజ్జవల్లి వాహనం<br>గ్రామ ఉత్సవం | శ్రీ ఎల్ వినాయకం లారీఓనర్ గుమ్మిడిపూడి |
| 29-6-85 శనివారం సాయంత్రం రాత్రి | పుష్ప ఉత్సవం<br>మహిషాసురమర్ధన<br>సింహ వాహనం<br>గ్రామ ఉత్సవం | సర్వశ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి<br>,, సుధాకరరెడ్డి<br>,, శ్రీనివాసులు రెడ్డి<br>,, రాఘవ సినీకాంప్లెక్స్-నెల్లూరు |
| 30-6-85 ఆదివారం సాయంత్రం రాత్రి | పుష్ప ఉత్సవం<br>వంటసేవ<br>గ్రామ ఉత్సవం | శ్రీ టి. కణ్ణా చోళా ఎక్స్‌పోర్టర్స్ మద్రాసు-21 |
| 1-7-85 సోమవారం సాయంత్రం రాత్రి | తెప్పోత్సవము<br>గ్రామ ఉత్సవం | శ్రీ వేనాటి మునిరెడ్డిగారు<br>రైల్వే కాంట్రాక్టర్-మవిళ్ళపాడు |
| 2-7-8 మంగళవారం రాత్రి | శయనసేవ<br>గ్రామ ఉత్సవము | శ్రీ పెరల జయప్రకాష్ టి.వి. టికి ప్యాక్టరి-నాయుడుపేట మరియు వారి మిత్ర బృందము |
| 3-7-85 బుధవారం రాత్రి | పుష్పపల్లకిసేవ | సర్వశ్రీ అయితా ఆనందకృష్ణయ్య,<br>కందగడ్డల సుబ్బారావు అండ్ బ్రదర్స్<br>ఆలపల వెంకటేశ్వర్లుగుప్త, ఎం. గురవయ్యశెట్టి<br>కాళంగి శ్రీనివాసులు శెట్టి అండ్ బ్రదర్స్<br>చీమకుర్తి మునెయ్యశెట్టి-సూళ్ళూరుపేట |

– ప్రత్యేక కార్యక్రమములు –

28-6-85 రాత్రి 7 గంటలకు కుమారి గౌరి బృందం (తెనాలి) వారిచే బుర్రకథ

30-6-85 రాత్రి 7 గంటలకు శ్రీ నటరాజ నృత్యనికేతనంవారి నృత్యప్రదర్శనలు (దేవాలయం సినిమాలో నటించిన కుమారి దేవి అండ్ పార్టి)

2-7-85 రాత్రి 7 గంటలకు ప్రసిద్ధ సినీప్లేబాక్ గాయకుడు శ్రీ మాధవపెద్ది రమేష్ బృందంవారి పాటకచ్చేరి

3-7-85 రాత్రి 8 గంటలకు సుప్రసిద్ధ సినీతార కుమారి ప్రభ బృందం భరతనాట్య ప్రదర్శనలు.

— భక్తులకు ప్రత్యేక విజ్ఞప్తి —

అమ్మవారి సేవకు విరాళములు ఇవ్వదలచినవారు ధర్మకర్తల మండలికి దేవాలయంలోనే సమర్పించవలెను.

- భవదీయులు -

వి. జయరామిరెడ్డి
కార్యనిర్వహణాధికారి

వేనాటి రామచంద్రారెడ్డి
చేర్మెన్ ట్రస్టుబోర్డు

: ట్రస్ట్‌బోర్డు సభ్యులు :

నత్తి ప్రకాశం Ex. MLA,
పుట్టు వెంకటరామయ్యశెట్టి,
శ్రీమతి వాసంరెడ్డి విజయలక్ష్మి
పెమ్మారెడ్డి మునికృష్ణారెడ్డి
ముచ్చకాల సుబ్రహ్మణ్యం

---

## నెల్లూరు సంగీత, నృత్య కళాశాల

ఉస్మాన్‌సాహెబ్‌పేట - నెల్లూరు-2

(Recognised by the Govt. of Andhra Pradesh)

కర్ణాటక సంగీతములో గవర్నమెంటు సర్టిఫికేటు డిప్లొమా పరీక్షలకు గాత్రము – వీణ – వయొలిన్ – భరతనాట్యము – మృదంగములలో అనుభవజ్ఞులైన విద్వాంసులచే శిక్షణ ఇవ్వబడును.

అడ్మిషన్లు 10-7-85 వరకు జరుగును.
సీట్లు పరిమితము త్వరపడుడు.

నూనె ఆదిశేషయ్య
ప్రెసిడెంటు

సి. సి. సుబ్బారాయులుశెట్టి
సెక్రటరి

యస్. గోపాలకృష్ణయ్య
ఫౌండర్ & మేనేజింగ్ డైరెక్టర్

యస్. సూర్యప్రకాశరావు
ప్రిన్సిపాల్

---

## SITUATION VACANT

Wanted: I. Two full time accounts clerks with B. Com. qualification for our office.

II. Lady steno typist proficient in english.

III. Production supervisors for our Padugupadu factory people with experience will be preferred.

Interested candidates should attend our office on sunday 23-6-85 at 10 A. M., 11 A. M., and 12 A. M respectively with necessary certificates.

Area manager
SMP PRIVATE LIMITED
16/609, Brindavanam
Nellore – 524001.




---

**25th ANNIVERSARY**

As part of Kelvinator's celebrations, a limited quantity of

**Kelvinator®**

REFRIGERATORS
are available at a very

**SPECIAL DISCOUNT**




Stockists:

**Sainathan & Co.,**

TRUNK ROAD - NELLORE

Phone: 5078, 4212.

# ప్రజాభిప్రాయం కోడై కూస్తుంటే ప్రత్యేకంగా విచారణ ఎందుకు?

**హరిజనుడు కాబట్టి ఆరోపణలు చేస్తున్నారనడం నీచం— దుర్మార్గం!**

గతవారం జమీన్‌రైతులో "జి. వ. మ గజ్జువదిలిందా?" అన్న శీర్షిక క్రింద వచ్చిన ఆరోపణలమీద ఛేర్మెన్ డాక్టర్ బాలచెన్నయ్యగారు ఒక సుదీర్ఘమైన సమాధానం పంపారు. ఆ వివరాలలోకి పోయేముందు ఆ జవాబుకు చివర అతను లేవనెత్తిన ఒక దుర్మార్గపు ఆరోపణను గూర్చి ప్రస్తావించదలచాము. "నేను హరిజనుడ్ని కాబట్టి, రాజకీయంగా శక్తివంతుడ్ని కాదు కాబట్టి మీరు నామీద ఇంతటి అభాండాలను ఆధారాలులేకుండా నాపైన చేస్తున్నారని నేను అనుకోవచ్చునా?" ఎంత నీచమైన ఆరోపణ ఇది? సమితి అధ్యక్షుడుగా ఈ బాలచెన్నయ్య అభ్యర్థిత్వాన్ని కాదా మేము బలపరచింది? ఇతని విజయానికి కాదా కొంతంత అధికారాన్ని ధిక్కరించి కృషిచేసింది? జి. వ. ఛేర్మెన్ అయిన కొంతకాలం తర్వాత నిశ్చయం పంతాలవలసంగతి వినిపిస్తున్నా వద్దుకుంటాదేమోనని మౌనం వహించింది ఇతనివల్ల స్నేహభావంతోనే కదా? అప్పుడంతా ఈయన హరిజనుడు కాదా? రాజకీయంగా దుర్బలుడు కాదా? జవాబు వ్రాయవచ్చు; అందరిలా చేయవచ్చు; హరిజనుడనే ముసుగులో అవినీతిని కప్పిపెట్టుకో చూడడం భావ్యం కాదు; సంస్కారమూ కాదు. ఇందులో మా లోపం, దోషం ఒకటుందంటే చెంపలేసుకుంటాము. బైట తీవ్రమైన ఆందోళనగా వున్నా ఇంతకాలం వ్రాయక పోవడమే మా తప్పు.

## బాలచెన్నయ్యగారి జవాబు

మరో అంశాన్నిగూర్చికూడా ముందు ప్రస్తావించాలి. తనను గద్దెనెక్కించింది తమనాయకుడైన శ్రీ నందమూరి తారకరామారావట; తాను ఈ రోజుకూ పార్టీకి, నాయకుడికి కట్టుబడివున్నాడట; పంగనామాలుపెట్టే అలవాటు తనకు లేదట. బాలచెన్నయ్యగారికి జ్ఞాపకశక్తి తక్కువో, కొంతదం సహజస్వభావమో తెలియదుకాని గతాన్ని నాలుగేళ్ళకిత్క్క-ముందే మరచిపోయారు: డాక్టరుగారూ! ఎక్కడో వూరుపేరులేకుండా పల్లెటూళ్లో పడివుండిన మిమ్ము తీసుకొచ్చి వ్యయప్రయాసలకు గురై తొలుత గద్దెఎక్కించింది నందమూరి కాదు కాదు: తెలుగు దేశంకాదు—గుర్తుకు తెచ్చుకోండి, కాంగ్రెస్‌వారు! నిన్నెవరు దొరికిందని పైకెక్కారు, దాన్ని తన్నివేశారు! నిజం కాదంటారా?

వాస్తవాలు తెలుసుకోకుండా వ్రాశామని, వ్యక్తిగతంగా న్యూనతపరచడానికి వ్రాశామని, తాను సంతృప్తిపరచలేక పోయినవారు తమ ఇష్టంవచ్చినట్లు ప్రచారం చేస్తున్నారని బాలచెన్నయ్యగారంటారు. ఆరోపణలకుగురియైన ప్రతివ్యక్తి నిరాధారమని ఖండించటం సంప్రదాయం. అంతులేకుండా తాను అమాయకుడన్నాడు పాపం!

మందులస్టోర్సులో వారిని వేసేచోట అపెండర్లుగా వేయలేదట; అక్కడే వర్మనెంటు చేశారట; సమస్య ఎక్కడ అనేది కాదుగదా! ఆఫీసు ఇల్లు, అద్దెను గూర్చి ప్రస్తావించారు. జి.వ.కు చెందిన భవనంలో ఆయన నివాసముంటున్నాడని మేము వ్రాయలేదు; ఇంకోరకంగా వ్రాయలేక ప్రాంతానికి వాగుకో బున్నారన్నాము. అద్దె డ్రా చేస్తున్నది లేనిది ఆయన ప్రకటనలో స్పష్టంగాలేదు; ఆఫీసును అడిగితే 'తెలియదు' అని జవాబు.

గెస్ట్‌హౌస్‌కు సంబంధించిన విభాగం బాలచెన్నయ్యగారు మాకు బోధించాల్నా? ఎవ్వటి సంగతో ఎందుకు- మొన్న 18 తేది ఒక ఎం. ఎల్. ఎ, గెస్ట్‌హౌస్‌లో ఒక సూట్‌కొరకు కాలోలు చేసి పంపాడు; ఒకటి ఛేర్మెన్‌పేరుతో, ఇంకొకటి వైస్ ఛేర్మెన్ పేరుతో బుక్ అయిపోయ్యాయనిచెప్పారట; పేర్లు మార్పుతప్ప ఎప్పుడూ ఈ విధంగానే బుక్ అవుతుంటాయి. అందరికి తెలిసిన వాస్తవం ఇది; బాలచెన్నయ్యగారు బుకాయిస్తారు!!

ఇళ్ళస్థలాల విషయం ప్రస్తావించారు. గతంలో ఎవ్వరికీ ఇవ్వలేదని మేము వ్రాయలేదు; బాలచెన్నయగారు తాను చెప్పుకున్నట్లు 'పేదవాడు' అవునోకాదో ఆయన సన్నిహితులకు తెలియాలనుకోండి; ఆయనకు స్థలం ఇచ్చినందుకు మాకు ఆక్షేపణలేదు. దర్గామిట్ట అంతా 'సంతర్పణ' అయిపోదేగదా! కాని దాను లక్షల రూపాయలకు వర్కింగ్‌హోం. నివాసం కలిపి నిర్మించబడేదానికి ప్రతి పనీ తులనాత్మకంగాచేసే కలెక్టరు సుజాతా రావుగారు స్థలదానం చేయడమే ఆ వార్తలోని విశేషం జమీన్‌రైతు కిచ్చిన స్థలాన్ని ప్రస్తావించారు బాలచెన్నయ్య. అది ఇవ్వబడింది వ్యక్తికికాదు, సంస్థకు సందర్భంకూడా స్వర్ణోత్సవ గుర్తుగా ఇచ్చింది కాని మామూలు సమయంలో కాదు. అటువంటివానికికూడా కలెక్టరమ్మగారు సంగతి సందర్భం తెలియకుండానే కలెక్టరుగా బాధ్యత తీసుకోకముందే రద్దుచేయమని ప్రభుత్వానికి వ్రాసిన విషయం బాలచెన్నయ్యకు తెలియక పోవచ్చు.

బాలచెన్నయ్యగారు విచారణకు సిద్ధం అన్నారు. ఆయనకంత వుత్సాహంగా వుంటే రాష్ట్రప్రభుత్వంకాదు: సి.బి.ఐ.కి అప్పగించి, జిల్లావ్యాప్తంగావున్న జి.వ.

—కొరవ 6వ పేజీలో

In the Court of the Principal
District Munsif Kadiri

E) P. No. 247/84 in O. S. No. 485/82

Between :-

సోమగట్ల శివారెడ్డి S/o చిన్నరామిరెడ్డి హిందూ, జీవనం,
కంతరవాండ్లపల్లి H/o. తమ్మలం కదిరి తాలూకా —వాది /DHr.

ఎదిరి

పులేటి చిన్నప్ప S/o. చిన్నవెంకటప్ప హిందూ జీవనం.
పూలికుంటపల్లి కదిరి తాలూకా —ప్రతివాది (JD)

## కోర్టు ప్రకటన

పై నెంబరు దావాలోని ప్రతివాది స్వాధీనానుభవంలోవుండు షెడ్యూలు తాలూకా ఆస్తిని కదిరి ప్రిన్సిపల్ మున్సిఫ్ కోర్టువారు 2-7-85 తేదీన ఉదయం 11 గంటలకు పై కోర్టు ఎదుట బహిరంగముగా వేలం వేయుదురు గనుక ఆస్తిని వేలములో కొనదలచినవారు వేలములో పాల్గొనవచ్చునని తెల్పడమైనది.

— షెడ్యూలు —

అనంతపురం జి॥ కదిరి సబ్ డి॥కి చేరిన పూలికుంటపల్లి గ్రామం పొలంకు చెందిన ఆస్తి వివరం :

| స.నెం | బాబు | స.నెం. | విస్తీర్ణము Ac. Cs. | హెక్టార్లు | శరం |
|---|---|---|---|---|---|
| 1) | మ.జిస్తి | 112 | 8.61 | 3.487 | 1.00 |
| | | | పైకి 1/2 భాగంమాత్రం | | |
| వాటి విలువ రూ. 1200-00 | | | అమీనా విలువ రూ. 12000-00 | | |
| 2) | మ.జిస్తి | 219-8 | 1.56 | 0.631 | 0-30 |
| | | | పైకి 1/4 భాగంమాత్రం | | |
| వాటి విలువ రూ. 200-00 | | | అమీనా విలువ రూ. 1200-00 | | |

( By order of Courj )

జె. గంగాధరరెడ్డి
డి.హో. తరపు అడ్వొకేటు

## ప్రకటన
## జవహర్‌భారతి : కావలి

వేసవి సెలవుల అనంతరం, కళాశాల 1-7-85 సోమవారం తిరిగి ప్రారంభించబడుతుంది. 1985-86 విద్యాసంవత్సరమునకు కళాశాలలోని ఇంటర్మీడియెట్ మరియు డిగ్రీ కోర్సులలో చేరగోరువారు ప్రవేశ దరఖాస్తు పారములను కళాశాల కార్యాలయములో 21-6-85 శుక్రవారంనుండి పొంద వచ్చును.

### ప్రవేశ నియమావళి :

1. ఇంటర్మీడియట్ క్లాసులకు సంబంధించినంతవరకు కావలిపట్టణముకోని, కావలి తాలూకాలోని హైస్కూళ్ళన్నీ స్థానిక పాఠశాలలుగా పరిగణించ బడుతాయి. ఈ పాఠశాలలనుండి ఉత్తీర్ణులైన విద్యార్థులకు 85 శాతము స్థానికేతర పాఠశాలలలోని విద్యార్థులకు 15 శాతము సీట్లు కేటాయించ బడుతాయి. స్థానికేతరవిద్యార్థులకు సంబంధించి ఓపెన్ కాంబినేషన్‌లో ఎస్.ఎస్.సి.లో కనీసము 475 మార్కులు, రిజర్వేషన్లలో కనీసం 360 మార్కులు వచ్చిన విద్యార్థులు మాత్రమే దరఖాస్తు చేయాలి.
2. డిగ్రీ క్లాసులకు సంబంధించినంతవరకు కావలి, మరియు వింజమూరు తాలూకాలు స్థానిక ప్రాంతంగా పరిగణించబడుతాయి. స్థానికులకు 85 శాతము సీట్లు, స్థానికేతరులకు 15 శాతము కేటాయించబడుతాయి.
3. దరఖాస్తు పారము పోస్టుద్వారా పొందదలచినవారు, ప్రిన్సిపాల్, జవహర్ భారతి, కావలి అను చిరునామాకు రు. 5/- లు ఎమ్.ఒ. ద్వారా పంపుచూ, స్వంత చిరునామా కల రిజిష్టేషను కవరు పంపాలి.

### స్కాలర్‌షిప్పులు·

ఈక్రింది స్కాలర్‌షిప్పులు అర్హులయిన విద్యార్థులకు ఇవ్వబడుతాయి

1. ఎస్. వి. కమల ఎడ్యుకేషనల్ అకాడమీ :
ఒక్కొక్కటి రు. 1500/- చొప్పున ముగ్గురు జూనియర్ ఇంటర్మీడియెట్ విద్యార్థులకు, అదేవిధముగా ముగ్గురు మొదటి సంవత్సరము డిగ్రీ విద్యార్థులకు ఇవ్వబడును. ఇంటర్మీడియట్‌లో ఒకరికి, డిగ్రీలో ఒకరికి కేవలం ప్రతిభ ప్రాతిపదికగా ఇస్తారు. మిగిలిన ప్రతిభ, మరియు ఆర్థిక పరిస్థితి ప్రాతిపదికగా ఇస్తారు.
2. డా॥ లక్ష్మీకృష్ణారావు మెమోరియల్ స్కాలర్‌షిప్ రు. 1000/- సం॥ ఈ స్కాలర్‌షిప్ ఒక పేద బ్రాహ్మణ విద్యార్థినికి ఇస్తారు.
3. శ్రీమతి టంగుటూరు సుబ్బమ్మగారి స్మారక ఉపకార వేతనము :
జవహర్ భారతి కళాశాలలో ఇంటర్మీడియట్ పబ్లిక్ పరీక్షలో అత్యధిక మార్కులు తెచ్చుకొని, ఇంజనీరింగ్‌లో చేరిన విద్యార్థికి రూ. 500/- అటులనే ఎం.బి.బి.యస్.లో చేరిన విద్యార్థికి రూ. 500/-లు ఇవ్వబడును.

డి. రామచంద్రారెడ్డి,
రెక్టార్ అండ్ కరస్పాండెంటు

# నెల్లూరు ముచ్చట్లు
విమర్శకుడు

### కలెక్టరు బదలీ?

ఇది హైదరాబాదులో వదంతు రూపంలో వ్యాప్తిలోవున్న వార్త అని ముందుగానే చెప్పుతుంటున్నాము.

కలెక్టరు కుమారి సుజాతారావుగారు త్వరలో శ్రీకాకుళంజిల్లా కలెక్టరుగా బదలీ కావచ్చుననేదే ఆ వదంతి. ఆమెను హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ స్పెషల్ ఆఫీసరు బాధ్యతలు స్వీకరించవలసిందని ప్రభుత్వం కోరిందని, కాని ఆమె దానికి తన విముఖత చూపి, శ్రీకాకుళంజిల్లా కలెక్టరుగా అయితే పోగలనని చెప్పిందని, అందువల్ల ఆమె అక్కడికే బదలీ కావచ్చునని వూహించబడుతున్నది.

అసలు సుజాతారావుగారు తనకు మరికొంతకాలం నెల్లూరులో వుండాలని వుందనే అభిలాషను వ్యక్తం చేసిందని, కాని ప్రభుత్వం దానికి సమ్మతించలేదని తెలిసింది. మంత్రి శ్రీమతి ప్రతిభాభారతి ఏదో సందర్భంలో సుజాతారావు తమ జిల్లా కలెక్టరుగా వస్తున్నదని హైదరాబాదు పత్రికా విలేఖరులతో అన్నదట.

"దూరపుకొండలు నునుపు"

### గూడూరు కౌన్సిల్‌కు క్లీన్ షీట్!

గూడూరు మునిసిపాలిటీలో దుర్వినియోగం జరిగినట్లు ఆధారాలేమీలేవని, అందువల్ల కౌన్సిల్ రద్దుప్రశ్నే వుదయించదని విచారణజరిపిన ఎస్. ఇ. శ్రీ మల్లేశ్వరరావు, ఇఇ శ్రీ గోవర్ధనరావుగారలు అభిప్రాయం వెలిబుచ్చినట్లు తెలుస్తున్నది.

మంచినీటి సరఫరా అభివృద్ధికి మంజూరైన లక్షలతో ప్రస్తుతపైప్‌లైనుకు సమాంతరంగా మరోలైను వేయాలని నిర్ణయించినట్లుకూడా తెలుస్తున్నది. దీనివల్ల జానకిరాంపేట, ఇందిరానగర్‌లకు పుష్కలంగా నీరు అందడమేకాకుండా, ఒకలైన్ చెడిపోయినా నీటిసరఫరా నిల్చిపోకుండా వుంటుందని ఇంజనీర్ల అభిప్రాయం.

### ఒకరిది అధికారం - ఇంకొకరిది అలంకారం!

నెల్లూరు ఇరిగేషన్ సర్కిల్‌కు ఇప్పుడు ఇద్దరు ఎస్. ఇలు.

పాత ఎస్. ఇ. శ్రీ వి. సత్యనారాయణరావు రివర్ధయిపోయి, జూన్ 4 తేది సుప్రీంకోర్టు ఉత్తరువుప్రకారం 10 తేదిన మళ్ళీ వచ్చి చేరారు; మధ్యకాలంలో రిట్లైన కోర్టు ఉత్తరువు ప్రకారం తిరుగా వుద్యోగంపొందిన శ్రీ ఎం. వెంకటరామరెడ్డి వచ్చిచేరాడు. ఇద్దరు ఎస్. ఇ. లయ్యారు! ఎవరిసంతకం చెల్లాలి? ఎవరి అధికారం చెలామణి కావాలి? ఈ చిక్కు సమస్యకు చీఫ్ఇంజనీరు రామాయపట్నం మధ్యస్తం చేశాడట. దానిప్రకారం ప్రస్తుతానికి ఎస్. ఇ. గా సత్యనారాయణరావు వ్యవహరిస్తారు; వెంకటరెడ్డిగారు గెస్టుహౌస్‌లో విశ్రాంతితీసుకుంటుంటారు, ఇదీసంగతి!

### బస్సుల గొడవ - ఎం. ఎల్. ఎ. ప్రకటన

సర్వేపల్లి రూట్లో ఇంతకాలంపాటు బస్సులు నడవక, కలెక్టరుగాని మరొకరుగాని ఎటువంటి చర్యా తీసుకోకుంటే ఎక్కడెక్కడిమాత్రం ఎట్లా సహిస్తారు? అందులో ప్రజాప్రతినిధులనేవాళ్ళు ఎట్లా వూరుకుంటారు?

ఈ సమస్యపై తాను అమరణ నిరాహార దీక్ష పూనుకోవలసివస్తుందని సర్వేపల్లి ఎం. ఎల్. ఎ. శ్రీ రామకృష్ణారెడ్డి ప్రకటించడం సముచితంగానే వుంది. ప్రయాణీకులు తీవ్రమైన అసౌకర్యానికి గురికావడమేకాదు, ఆందోళన కూడా ఎక్కువగావుంది. అధికార్లు వెంటనే చర్య తీసుకోవడం అవసరం.

జీతాలు ఇంకా రాలేదట; జూన్ నెలకైనా సకాలానికి వస్తాయన్న నమ్మకమూ లేదట అయ్యవార్లు ఆందోళనతో మంటున్నారు!

ఇంతకీ ఈ ఆలస్యానికి కారణమేమిటయ్యా అంటే డబ్బు లేకపోవడం కాదట. బిల్లులు వ్రాయడానికి బద్ధకించారట. అసలు జీతాలు డ్రాచేసు కావడానికి ముందుగా, ప్రతిఏట ఏప్రెల్ 1 తేది లోగా ప్రభుత్వానికి పంపవలసిన ఫైనాన్షియల్ స్టేట్‌మెంటు మేనెలవరకు పంపలేదట. పైగా ప్రతినెలా జీతాల బిల్లులు, అంతకు క్రితంనెల 20 తేదికల్లా సిద్ధం చేసి డి. ఇ. ఓ. కు కాలేజి ప్రిన్సిపల్ వద్ద సంతకం చేయించవలసివుంటుందట. జీతాలిచ్చేది ప్రభుత్వం కాబట్టి వారే ఈ ఏర్పాటు చేశారట.

ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్స్ సంఘం నెల్లూరుశాఖ ఆధ్వర్యంలో జరిగిన ప్రపంచ పరిసరాల దినోత్సవ సభలో ప్రసంగిస్తున్న డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, ప్రక్కన సభాధ్యక్షుడు, ఇంజనీరు టి. సుందరరామరెడ్డి, చివర్న సంఘ కార్యదర్శి బి. మల్లికార్జున్.

### స్టీల్ ఏమైంది?

వెంకటాచలం సమితి కార్యాలయ ప్రాంగణంలో సంవత్సరంగా పడివుండిన 8 ఎం. ఎం. కమ్ములు రాత్రికి రాత్రి అదృశ్యమయ్యాయట. రెండు టన్నులుంటాయట.

ఏమైనా కాలనీనిర్మాణానికి తరలిందా? చీకటి బజారుకు పయనించిందా? అని ఒకరి సందేహం. విచారించి చెప్తాము.

### వి ఆర్ కాలేజి లెక్చరర్లకు జీతాలులేవు!

వి ఆర్ కాలేజి లెక్చరర్లకు మేనెల

అయితే ఒక్క నెలకోకూడా కాలేజీ సిబ్బంది బిల్లులు సకాలంలో చేసినవరు లేరని. అందువల్ల ప్రతినెలా 7, 8 తేదీలలో తప్ప జీతాలు రావడంలేదని అయ్యవార్లు గోలచేస్తున్నారు.

కొన్ని ప్రసిద్ధ సంస్థలు కాలోవగాలుగా పేర్లతిల్లినతర్వాత, వాటి బదున్నూ అనే ప్రభుగిరోకాయని చరిత్రచెప్తు అప్రతిష్ఠాపన్నత దాపురించచేస్తున్నారు కాలేజీ కమిటీవారు?

—కారవ 5సి పేట

Sri Sarvodaya (Arts & Science) College, Nellore

REOPENING DATE 9 JULY 1985

| Gourses offered | Combinations available |
|---|---|
| B. A., | (1) A.E.S. (2) H.E.P. (3) M.E.S. (Telugu Medium) |
| | (4) Commerce, Economics & Rural Banking (Restructured conrse Telugu Medium) |
| B. Sc., | (1) B.Z.C. (2) Z.P.C. (3) M.P.C (Telugu Medium) |
| | (4) Maths, Physics & Electronics (Restructured course-Telugu Medium) |
| B. Com., | Compulsory Subjects and Group-III Optionals English and Telugu Medium |
| Intermediate | (1) B. P. (2) M. P. (3) C.E.C English & Telugu Medium (4) H E C. Telugu Medium. |

Application forms and Prospectus can be had from the Principal on payment of Rs 6/- in person Rs. 7- by Crossed Postal Order drawn in favour of the Principal. Applications duly filled in with required enclosures shall reach the Principal with registration fee of Rs 2/-either in cash or by Crossed Postal order drawn in favour of the Principal with in 25 days after the publication of the results of respective qualifying examinations. Extension of last date of registration, if any, will be notified on the College notice board.

-V. MADHAVA RAO M.A., LL. B.
Principal.







Phone: 6336

శ్రీ చదలవాడ కాలేజి ఆఫ్ ఇంజనీరింగ్

రెడ్డిమిట్ట (DRDA ఆఫీసు దగ్గర)

నెల్లూరు - 524 008

A. M. I. E.

ప్రారంభం: 17-7-85

B. Tech. అన్ని యూనివర్సిటీలకు ట్యూషన్

WANTED

A Lady tutor with experience for two elementary class children. Interested persons are requested to attend an interview at 16/1176. Kasturidevinagar. Nellore on 23—6—85 at 4 P. M.

V. RADHAKRISHNA





# సంతాపము

పన్నారెడ్డి దశరథరామిరెడ్డి గార్ముల [illegible] దిది దిశకేగిన [illegible] పదాచిరు నవ్వుతో పలుకరించు శాంతిస్వరూపా, [illegible] యొక్క హృదయపూర్వకమైన అభిమానములను మరువలేము మీయొక్క అకస్మిక మరణమునకు చింతిల్లుచూ మీ ఆత్మకు శాంతిని ప్రసాదించవలసినదిగా దేవుని ప్రార్థించుచూ కుటుంబసభ్యులకు ప్రగాఢ సంతాపము తెలియ జేయుచున్నాము.

ఈదూరు శ్రీహరినాయుడు
బూదవం

లక్ష్మి సరస్వతి ట్యుటోరియల్స్

(ముని ఎడ్యుకేషనల్ సొసైటీవారి ఆధ్వర్యములో)

299, కాపువీధి - నెల్లూరు.

B.Ed.,

కామన్ ఎంట్రన్స్ కోచింగ్ సెంటర్

అనుభవము కలిగిన విశ్వవిద్యాలయాల అధ్యాపకులచే శిక్షణ ఇవ్వబడును

B. A., B. Sc., B. Com.,

మూడవ సంవత్సరం పరీక్షలు వ్రాసినవారు కూడా అర్హులు.

గత సంవత్సరం 97% ఫలితాలు సాధించిన సంస్థ.

కొద్దిసీట్లుమాత్రమే వున్నవి.

PLAN YOUR WORK ॐ WORK YOUR PLAN

Estd: 1979 Phone: 3386

Sri Balaji Vidyalayam

21-33A, BalajiNagar (Milk booth Street)

NELLORE - 524 002

TUTION COACHING

Admissions are open to classes

VII to X (English Medium only)

Number of students are limited in each class. For efficient coaching and individual attention and best results, get coaching in "SRI BALAJI VIDYALAYAM"

We secured 80% results in the academic year 1984-85

For details please contat:

—CORRESPONDENT

## వెంగళరావు

(మొదటి పేజి తరువాయి)

యాయులైన ఒక కులంవారికి పిసిసి లో ఎక్కువ ప్రాతినిధ్యం కల్పించి తమ కులానికి చిన్నచూపు చూశారని ఇంకో కులం నాయకులు ఆయనమీద మండి పడుతున్నారు. ప్రస్తుతం వీరంతా మాజీ ముఖ్యమంత్రి శ్రీ భవనం వెంకట్రామను ముందుకుతోసి డ్రామా నడిపిస్తున్నారు. కృష్ణాజిల్లాలో పిన్నమనేని కోటేశ్వర రావు, కె. ఎల్. ఎన్. ప్రసాద్ వర్గానికి బద్ధశత్రువులై పి సి సి లో ప్రాతినిధ్యం పొందలేకపోయిన పాలడుగు వెంకట రావు, పిసిసి మాజీ అధ్యక్షుడు శ్రీ జి. వెంకటస్వామి మరో మాజీమంత్రి శ్రీ కేశవరావు ఆయనతో జతకలిసారు. వీరంతాకలిసి రాష్ట్రంలో త్వరలో క్రాంతి ఉద్యమాన్ని చేపట్టనున్నామని ఇటీవల ప్రకటించారు. ఈ ఉద్యమం విషయమై పిసిసి అనుమతి తీసుకోవలసిన అవసరం తమకులేదని వారు అన్నారు. శ్రీ వెంగళరావు నాయకత్వంలో పార్టీ పునరుజ్జీవనానికి బాగా కృషిజరుగుతున్నందువల్ల తామెక్కడో మరుగున పడిపోతామేమోనని వీరు ఈ ఉద్యమానికి ప్రయత్నిస్తున్నట్లు తెలుస్తున్నది. ఈ ఉద్యమంద్వారా పార్టీలో వెంగళరావు ప్రాభవాన్ని ఎదుర్కోవాలని అవసరమైతే ఆయనను తప్పించడానికికూడా ప్రయత్నించవచ్చునని అనుకొంటున్నారట. అయితే శ్రీ వెంగళరావుమాత్రం, వీరియత్నాలను చిరునవ్వుతో కొట్టిపారేస్తూ వ్యక్తిగత స్థాయిలో వారు ఐక్యమంతలపెడుతున్నారని పి పి సి కి సంబంధంలేదని అంటున్నారు. పార్టీకి ప్రస్తుతం వున్న కార్యక్రమం ఇల్లు చక్కదిద్దుకోవడమేనని ఆయన అంటున్నారు.

## అక్కినేని

(మొదటి పేజీ తరువాయి)

పార్టీకి సేవచేయవచ్చునని అనుకొంటున్నారు. శ్రీ నాగేశ్వరరావును కాంగ్రెస్ (ఐ) లోకి రప్పించడంలో పి సి సి (ఐ) అధ్యక్షుడు శ్రీ జలగం వెంగళరావు ప్రమేయం కూడా ఉందని అంటున్నారు.

రామారావు పరిపాలన తీరు పట్ల శ్రీ నాగేశ్వరరావు ఇటీవల కాలంలో తన సన్నిహితులవద్ద తీవ్ర అసంతృప్తిని వెల్లడిస్తున్నారట.

లౌక్యాన్ని ప్రదర్శించడంలో దిట్ట అయిన నాగేశ్వరరావు శ్రీ రామారావు అధికారం స్వీకరించగానే ఆయనకు మద్దతు ప్రకటిస్తూ నటుడిగా తీసుకున్నట్లుగానే ముఖ్యమంత్రిగా కూడా రామారావు అవార్డులు సాధించినప్పుడే పదవికి సార్థకత లభిస్తుందని అన్నారు. అయితే రామారావు పరిపాలన సక్రమంగా చేయలేకపోవడమేకాక తనకుటుంబ ఆస్తులను పెంచుకోవడంపై శ్రద్ధ చూపుతున్నందుకు శ్రీ నాగేశ్వరరావు ఆయనను విమర్శిస్తున్నారని తెలుస్తున్నది. మనసులో శ్రీ రామారావు అంటే వున్న అయిష్టతను బహిరంగంగా వెల్లడించే సమయం వచ్చిందని ఆయన అనుకుంటున్నారట. కాంగ్రెస్ (ఐ) లో చేరాలని శివాజీ గణేశన్ కూడా శ్రీ నాగేశ్వర రావుకు సలహా ఇచ్చారని తెలుస్తున్నది.

— —

## ఇంటరు ఫలితాలు

కె. ఆదిశేషయ్య

ఎనభై రెండులో నలభైయారు
ఆపైఏడు ముప్పైశాతం
గడచిన ఏడు నలభై
మరి యీ ఏడు ముప్పైఐదు.

ఇవేంటి మాష్టార్లు
మన యింటర్ ఫలితాల కాటాలు.
దిగజారుతున్నాయి
మన విద్యాప్రమాణాలు.

ఏడో తరగతి కామన్
పదో తరగతి పబ్లిక్
రెండూ దాటి యింటరుకొస్తే
యిక్కడా మరోపెద్ద ఫుల్‌స్టాప్

కారణాలు ఎన్నెన్నో
మోయలేని సిలబస్ భారం
చీటికిమాటికి సమ్మెలహోరు
అంతకుమించి రాజకీయాలజోరు

అందుకోండి అమ్మాయిలు
అభినందనల పరంపరలు
ముప్పైఏడు శాతం ఫలితం
గుడ్డిలోమెల్ల. అబ్బాయిలకంటె

మహేష్ ప్రదీప్, కిరణ్, మురళి
చదువులతల్లి ముద్దుబిడ్డలు మీరు
ఈనాటి మేటి విద్యార్థులేకాదు
రేపటి జాతిరత్నాలూ మీరే.


**జమీన్‌రైతు చందా**

| | |
|---|---|
| సంవత్సరం చందా | 40-00 |
| ఆరునెలలకు ,, | 20-00 |




## ●● సంస్మరణ



**శ్రీ బెల్లంకొండ రమణయ్యనాయుడు**
(గంగదేవిపల్లి)

శ్రీ మహాలక్ష్మీ లెమన్ కంపెనీ
గూడూరు

స్నేహ సౌహార్ద్రాలకు ప్రతీక – వాత్సల్య మమతానురాగాలకు ప్రదీపిక
క్షణక్షణం అనుక్షణం – అతని స్మరణం
మా మనసులలో మమేకమై – తాదాత్మ్యమై అమరమై
చిరకాలం చెరగిపోని – అనుబంధమై
సదా సంస్మరణజీవమై నిలచి నిండిపోవాలి.

అతని ఆత్మకు శాంతి ప్రసాదించాలని ఆ సర్వేశ్వరుని ప్రార్థిస్తూ

**తిలక్ రాజ్‌వాహి**
లెమన్ మర్చెంటు
New Azadpur, Subzi mandi
DELHI – 33

**తలమంచి శిద్దారెడ్డి**
లెమన్ మర్చెంటు (GTS)
గూడూరు, నెల్లూరుజిల్లా

## శివారెడ్డి పద్యాలు

### రెట్టమతము

రాజీవయ్యగాంధి రష్యాకు బయల్దేరె
అమెరికాకు రాండి అగ్రహమ్మ.
కదుపుపుమంట అమెరికాకెళ్తె రాజీవ
రష్యయూకు కంది తగడగుంది।

రెండూ రెండే కోవ
ద్రండి రాజీవ! కడవదాటి ఎందుకి
దండుగ్మ్రకార్దమ్ము, ఎటోన్న
గంతమద వ్వంది,
మున్సు గడచిపొయ్యింది।

పిక్కుతారికెల్ల చెరిపొయ్యేకాలమ్మ
బాపురించె పైరుయైపోయింది,
ఉగ్రవాదులంట షరిదీసిపోశేస్తె
బోల, బైలశిక్ష వాలునాంట!

మా ప్రధానమంత్రి మణిపూస రాజీవ
విర్రవిగుసుకుంటె వ్యతజేస్తె
తమలు, అమెరికాకు తశ్శేట్లు అగచాటు
తిక్కుమొక్క తెండు తుక్కుదావు!

మంచివాడు చాల మర్యాదగలవ్యక్తి
రీగవని ప్రతీది నాగులకుసు
పాలుపోసి యిండ్యపైకి బంపిస్తారు.
నాగువదవే యింతకీగనీవు।

పాకు దొంతనమును వంపించసాగావు
మందుగుండు దాటుమాటు, నీకు
యిండియావిరోధి హితుడు పాకిస్తాను
రీగనయ్య ఎంత రెట్టమతము,

మాకెగాడు నీకుమూత్రమ్ము షేమమ్ము
నిక్కు వగ్రవాళ్ల చేతదిస్తె?
నీక్కుసమలదాకు మెడబట్టిగెంటెయ్య
తప్పుగాడు దీని మున్పుగాడు।

### సిఫార్సు

చేదుగాదు మాకు నీమనస్మనము,
అలమటాటుగాల హాలరొల్ల,
మరొకపూటనస్త సుక్యాదచవిజాస్త
విషయ! నీదుకోర్కె తీర్చిపేస్త!

## జిల్లావార్తలు

(5వ పేజీ కొనసా)

పడిపోరు, బావి పై పులసీ చిల్లులు; మోటా రాస్తా దొంగలెత్తుకపోయారు, ఇక నీళ్ళెక్కడిశి? రెండుంబడ్డు రూపా యలు ఏల్లో నివల్లయింది!

### శ్రీహరికోట సంఘం

శ్రీహరికోట హరిజన గిరిజన వుద్యోగుల సంక్షేమసంఘానికి ఈక్రింది కార్య వర్గం ఎన్నికైంది.

బి. విజయకుమార్ రిటర్నింగ్ ఆఫీసరు: ఎం. జయపాల్ అధ్యక్షుడు: ఎస్. మణి ఉపాధ్యక్షుడు: టి. రామానందం ప్రధానకార్యదర్శి; ఎల్. రంగయ్య ట్రెజరర్.

### కావలి టీచరు దౌర్జన్యం

కావలి కన్నేరిమిట్టరోడ్డులో గుడిసె వేసుకొని కాపురముంటున్న మన్నెమేల వీరారెడ్డి కుటుంబంపై పొరుగునవున్న టి. రాఘవరెడ్డి అనేటీచరు దౌర్జన్యంచేసి. గుడిసె కూలద్రోసి, నానా బీభత్సం చేశాడట.

కన్నేరిమిట్టరోడ్డు ప్రక్కన దాదాపు 50 మంది ప్రభుత్వస్థలం ఆక్రమించుకొని గుడిసెలు వేసుకున్నారట. చాలా కాలం నుంచి నిరాటంకంగా జరిగి పోతూంది ఈ ఆక్రమణల తతంగం. వారిలో టి. రాఘవరెడ్డి అనేటీచరుకూడా ఒకరట. ఈ ప్రాంతంలో ఆయన దొక్కటే 'మేడ' అట. ఈమధ్య ఆయనకు తన 'సామ్రాజ్యం' విస్తరించుకోవా లని కోరిక కలిగిందట.

ఆయన ఇంటిని ఆనుకునే, వీరారెడ్డి గుడిసె వుండేది. మొన్న 12 తేది రాత్రి వీరారెడ్డి ఇంట్లో లేని సమయంచూసి, రాఘవరెడ్డి కొంతమంది సాయంతో, హఠాత్తుగా ఆ గుడిసెపై దాడిచేసి ఇంట్లో ఆడవారిని దిక్కరదన్ని, గిన్నె తొచ్చెలు బయటి వీధిలో వేసి, గుడిసెను నేలమట్టం చేశారట. తర్వాత వీరారెడ్డి వచ్చి చూసు కునేసరికి, బీభత్సంగా వుందట పరిస్థితి. వెంటనే అతనువెళ్ళి పోలీసుకు ఫిర్యాదు చేశాడట. అయితే ఇప్పటివరకు పోలీ సులు ఎటువంటి చర్య తీసుకోలేదట. పాపం వీరారెడ్డి ఇప్పటికి కూలిన గుడి సెలో తలదాచుకొని వున్నాడట. ఈ విషయం కలెక్టరుకుకూడా నివేదించారు కాని, ఇంకా ఫలితం కన్పించినట్లులేదు.

కావలిలో ఇళ్ళస్థలాలకు సంబంధించి సంతవరకు బలవంతుడిదే రాజ్యం. అందులో సందేహంలేదు. అయితే 'గ్రద్దలు' 'కాకుల'మతన్ని పీకికోసడ వేస్తుంటే, అధికారులు చూస్తూవూరు కోవడం సబబా? ఆక్రమణలు ఎవరుచేసినా తప్పే! ఇంకతో పేదవాడికి ఒకనీతి. పెద్దవాడికి ఇంకొకన్యాయం వుండ కూడదు. కలెక్టర్ జోక్యంచేసుకొని ఈ విషయంలో దర్యాప్తుజరిపించి, న్యాయం జరిగేటట్లుచూడడం అవసరం.

## నిలువు దోపిడీ

(5వ పేజీ కొనసా)

న్నారు. కొలగట్లలో శ్రీ పట్టమూరు సుందరరామరెడ్డి ఇంట్లో 14 తేది రాత్రి 20 వేల రూపాయల విలువచేసే బంగారు నగలు దోపిడియ్యాయి. 15 తేది రాత్రి టి.సి. పల్లెలోని ఒకరింట్లో 30 వేల రూపాయల నగలు దోచుకొనిపోయారని

అపహరించుకున్నారు. ఈ దొంగలకట్ట వాళ్ళకి తగిలా : షత్తచేతులతో పోయారు. ఆత్మకూరు టక్షణాన్నైతం కొన్ని చోరీ జరిగినట్లు తెలుస్తున్నది. ఇంకా పోలీసుకు తెలిసా?

### బస్ ప్రమాదం- చెకింగ్ చావు

12 తేదీ బద్వేలునుండి నెల్లూరువైపు తిరుపతికి 200మంది ప్రయాణీకులతో వస్తుండిన బస్సు అనే పుష్పకవిమానం (ఎ. పి. యస్. 3392) బ్రాహ్మణపల్లి వద్ద అదుపుతప్పి పల్టీకొట్టి చెకింగ్ దుర్మ రణం పాలైనాడు, 40మందికి గాయాలు అందులో ఏడుమందికి పరిస్థితి సీరియస్ అన్నారు.



తొలి ఏకాదశి

28-6-1985 తేది శుక్రవారం తొలి ఏకాదశి

అర్ధరాత్రి

5-7-1985 తేది శుక్రవారం రాత్రి 12-01 గంటల వరకు అర్ధరాత్రి వుంటుంది.

ధరలు

ఆషాఢమాసంలో అన్ని వస్తువుల ధరలు సమానముగా వుండగలవు.

జూన్ తిథులు

22 శని చవితి సా. 4-12 గం. వ.
23 ఆది పంచమి ప. 2-54 గం. వ.
24 సోమ షష్ఠి ప. 1-25 గం. వ.
25 మంగళ సప్తమి ప. 11-29 గం వ
26 బుధ అష్టమి ప. 9.07 గం. వ.
27 గురు నవమి ఉ. 6-45 గం. వ.
దశమి తె 4-19 గం వ.
28 శుక్ర ఏకాదశి రా 1-46 గం. వ.

—నిమ్మగడ్డ వేంకటేశ్వరశాస్త్రి.



దౌర్జన్యానికిగురై శిథిలావస్థలోవున్న వీరారెడ్డి ఇల్లు

## సవరణ

7-6-85 తేది జమీన్రైతు వార పత్రిక 11వ పేజి వల్లవకాలం నెల్లూరు జిల్లా కోర్టు E P No. 185/83 O S 2201/80, పి. శేషాచలం అడ్వొకేటు ప్రకటనలో వాయిదా తేది 24-5-85 బదులు 24-6-85 తేదిగా సవరించుకోవలసినది. —మేనేజరు.

# సుమన్ అరెస్ట్ వెనుక సాటి నటుల కుట్ర వుందా?

తెలుగు, తమిళ చలనచిత్ర పరిశ్రమ వంతటినీ కల్లోలపరచి, సంచలనం సృష్టించిన 'సుమన్' వివాదం సద్దుమణిగింది. వెనుక మాపు ఎరుగని సినీ మాయాలోకం, మెల్లి మెల్లగా ఈ దురదృష్టకర సంఘటనను మర్చిపోతూంది. మరికొంత కాలానికి అసలు సుమన్ అనేవాడు ఈ పరిశ్రమలో వుండివెళ్ళాడనే విషయం కూడా మర్చిపోవడం జరిగినా ఆశ్చర్యంలేదు. ఈ మాయాలోకంలో ఏదీ విచిత్రం కాదు.

ఇప్పుడిప్పుడే వృద్ధిలోకి వస్తున్న ఒక వర్ధమాన నటుడి భావిజీవితాన్ని నిర్దాక్షిణ్యంగా నలిపి నాశనం చేసిన ఈ సీరియల్ నాటకం వెనుక అసలు సూత్రధారులెవరు? 'సుమన్' చేసిన నేరం సమపాళ్ళలో వున్నాయా? సుమన్‌ను ఇంత తీవ్రంగా శిక్షించడానికి కేవలం నీలి చిత్రాలు, అందుకు సంబంధించిన బ్లాక్‌మెయిలింగ్ వ్యవహారాలే కారణమా, వ్యక్తిగతంగా ఇందులో ఎవరైనా పాత్ర పోషించారా? ఈ దారుణ సంఘటనను వెలికి తీయడానికి కేవలం ప్రమాణం చేయనక్కరలేని ఈర్ష్య అసూయలు ఏవైనా అంతర్గతంగా దాగివున్నాయా?

ఇటువంటి ప్రశ్నలు లెక్కకు మించి ఇప్పుడు పరిశ్రమలో వినిపిస్తున్నాయి.

సుమన్‌కు నీలి చిత్రాలకు గల సంబంధం స్పష్టమైనది; దానిని ఎవరూ కాదనలేరు. పోలీసులు అరెస్టు చేయడానికి చాలా కాలం ముందే ఈ విషయమై వదంతులు వినిపిస్తూ వచ్చాయి. అయితే అప్పుడెవరూ వాటిని సీరియస్‌గా పరిగణించ లేదు.

అయితే, ఎంతవరకు నిజమో కాని, చిత్రసీమలో ఈ రోజు తారాపథంలో వున్న ప్రసిద్ధ నటులు, నటీమణులు కూడా తమ నట జీవితం ప్రారంభదశలో బ్లూఫిలింల పైనే ఆధారపడి వుండేవారన్న వదంతులు వినిపిస్తుంటాయి. అందుకు సాక్ష్యాధారాలు కూడా చూపుతుంటారు. నైతిక విలువలకు అస్కారమే లేని ఈ దౌర్భాగ్య పరిశ్రమలో, నటనకోసం వచ్చే కన్నెపిల్లలతో ఆటలాడుకునే మృగాలున్న ఆటవిక సీమలో ఇటువంటి సంఘటనలు అసాధ్యం కాదు.

సుమన్ కూడా ఆదిలో జీవనాధారం కోసమో, చిత్రపరిశ్రమ పట్ల మోహావేశంతో వివ్వెవ లెక్కడం కోసమో ఈ నీచకృత్యానికి పాల్పడి వుండవచ్చు. అయితే అతను అక్కడితోనే ఆగిపోయాడా, లేక పేరులోకి వచ్చిన తర్వాత కూడా ఈ దగుల్బాజీ జీవనానికి సిద్ధపడ్డాడా అనేది ప్రశ్న.

సుమన్ భాగస్వామిగా చెప్పబడుతున్న 'దివాకర్' నువ ఉపరాష్ట్రపతి శ్రీ వెంకట్రామన్‌కు సమీప బంధువట. అంత ఉన్నత కుటుంబంలో పుట్టి, ఆటువంటి అప్రాచ్యపు పని ఎందుకు చేశాడో మరి?

పరిశ్రమలో కొందరు చెప్పడం, సుమన్ అరెస్ట్ వెనుక కేవలం వారి బ్లాక్‌మెయిలింగ్‌కు గురైన ఆడపిల్లలే కాక, పరిశ్రమలో వృత్తిలో సుమన్‌కు పోటీదారులైనవారి హస్తం వుందా అన్న సందేహం తలఎత్తుతున్నది.

సుమన్‌తో సమానంగా ఇటీవల కాలంలో తెలుగుసీమలో అత్యంత వేగంగా దేరింగ్ హీరోగా పేరులోకి వస్తున్న ఒక వర్ధమాన నటుడు, వృత్తిపరంగా తనకు పోటీ లేకుండా చేసుకోవడానికి ఈ సంఘటనను తీవ్రరూపం ధరింపజేశాడనే పుకారు ఒకటి దట్టంగా వ్యాపిస్తుంది. ఈమధ్య సుమన్ తెలుగులో ఎంతో బిజీ నటుడైనాడు. ఆయన నటించిన చిత్రాలు కూడా విజయం సాధించడంతో, ఇప్పుడిప్పుడే నిర్మాతలు ఆయన ఇంటిముందు బారుగడటం ప్రారంభించారు. ఈ పరిస్థితిలో సుమన్‌ను ఇట్నే ముందుకు సాగనిస్తే తన భవిష్యత్తుకు ప్రమాదమని భయపడిన ఆ యువనటుడు, ఎంతో నేర్పుగా, సుమన్ బలహీనతలను కనిపెట్టి, సంబంధీకులను రెచ్చగొట్టి, ఈ సాలెగూడులో ఇరికించాడని పరిశ్రమలో

—కొతవ 10వ పేజీలో

# 'సిఫ్కా' సన్మానాలు

నెల్లూరులో క్రమంతప్పకుండా నాటిక పోటీలు, ప్రదర్శనలు ఏర్పాటు చేస్తున్న 'సిఫ్కా' ఇటీవల టౌన్‌హాల్‌లో మూడురోజులపాటు తమ 8 వార్షికోత్సవాన్ని ఘనంగా జరుపుకొంది. ఈసందర్భంలో, కొత్త ప్రయోగంగా పౌరాణిక నాటకోత్సవాలు కూడా నిర్వహించారు. కురుక్షేత్రం, మాయాబజారు, సీతాకళ్యాణం వంటి నాటకాలు ప్రదర్శించారు.

తొలిసభను మునిసిపల్ కమీషనర్ శ్రీ బి. ఎల్. నరసింహం ప్రారంభించారు. డి పి ఆర్. ఒ. శ్రీ వెంకటరత్నం అధ్యక్షించారు. సింహపురి సంపాదకుడు శ్రీ అ కు ల సుబ్రహ్మణ్యంను సన్మానించారు.

రెండవరోజు లాయర్ సంపాదకుడు శ్రీ తుంగా రాజగోపాలరెడ్డి అధ్యక్షతన సభ; విశాలాంధ్ర విలేకరి శ్రీ కె. వి. రమణయ్యకు సన్మానం;

చివరిరోజు ఉదయం దినపత్రిక సంపాదకుడు శ్రీ ఎ.బి.కె. ప్రసాద్‌కు నార్ల గారిపేరుతో ఒక అవార్డు సమర్పించారు. ఈ సభకు శ్రీ వి. వి. కృష్ణయ్య అధ్యక్షించారు; జి. ప. ఛైర్మన్ డాక్టర్ బాల చెన్నయ్య, మాజీ ఎమ్మెల్సీ శ్రీ మాదాను గంగాధరం, ఎమ్మెల్యేలు శ్రీ రామకృష్ణారెడ్డి, శ్రీ దుగ్గా ప్రసాదరావు, డిప్యూటి డైరెక్టర్ శ్రీ ఎం. చంద్రశేఖరయ్య, జగదేవిపేట సర్పంచ్ శ్రీ జక్కా రంగారెడ్డి, ఇండియన్ బ్యాంక్ మేనేజర్ శ్రీ శర్మ, గోల్డ్‌స్పాట్ కంపెనీ అధినేత శ్రీ చిదంబరం తదితరులు ప్రసంగించారు. శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు సభ నిర్వహించారు. సిఫ్కా కార్యదర్శి శ్రీ నాదెండ్ల సుబ్బారావును అందరూ ప్రశంసలతో ముంచెత్తారు. ——



# త్రీ-డి యుగం అప్పుడే సమాప్తం!

తెలుగువాళ్ళది ఏ దివ ట్టా వేలం వెర్రి; పైగా ఆరంభశూరత్వం.

నాలుగునెలల క్రితం 'చిన్నారిచేతన' త్రీడి చిత్రం విడుదలై విజయం సాధించినప్పుడు, అది చూసి కన్నుకుట్టిన నిర్మాతలు మేమంటూ మేమని పోటీలుపడుతూ త్రీడిచిత్రాల నిర్మాణానికి పూనుకున్నారు. ఏరోజు దినపత్రిక తీసిచూసినా, ఒక కొత్తచిత్రం త్రీ డి లో రాబోతున్నట్లు పేజీలకు పేజీలు ప్రకటనలు కన్పించేవి. కొందరైతే నటీనటుల పేర్లుకూడా ప్రకటించేశారు. ఆ జోరుచూస్తే, తెలుగు చిత్ర పరిశ్రమలో త్రీడీయుగం ప్రారంభమైందా అన్పించింది.

కొత్త మోజంతా ఏమైపోయిందో, ఇప్పుడొక్క నిర్మాతా త్రీడీల పట్ల ఆసక్తి చూపడంలేదు. ఇప్పటికే షూటింగులు మొదలుపెట్టిన నిర్మాతలు కూడా ఇప్పుడు పునరాలోచనలో పడ్డారని వినికిడి.

చేతన తర్వాత విడుదలయిన హిందీ, ఇంగ్లీషు త్రీడి చిత్రాలు ఫెయిల్ కావడం, పైగా థియేటర్ల యజమానులు త్రీ డి ప్రదర్శనకు అనుగుణంగా తెరను అమర్చుకోలేక అభాసుపాలు కావడం, కేవలం ఎ క్లాస్ సెంటర్లలో మాత్రమే ఈ చిత్రాలు విడుదల చేయవలసిరావడం నిర్మాతల వెనుకంజకు కారణమంటున్నారు. కారణం ఏదైతేనేమి, తెలుగులో త్రీ డి యుగం ఇంతటితో సమాప్తమైందని చెప్పొచ్చు.

## సత్యనారాయణకు హిందీఛాన్స్

తెలుగు క్యారెక్టర్ నటుడు సత్యనారాయణకు హిందీఛాన్స్ తగిలింది. 'కర్మ' అనే 70 ఎం ఎం చిత్రంలో సత్యనారాయణ విలన్‌గా నటిస్తున్నాడు. భారీ చిత్రమిది, దీనికి సుభాష్‌ఘయ్ నిర్మాత.

ఇప్పటివరకు తెలుగు నటీమణులు, దర్శకులు హిందీ సీమలో స్థానం సంపాదించుకుని, పేరు ప్రతిష్ఠలతో పాటు అపారమైన సంపదలు ఆర్జిస్తున్నారు.

## సినిమావార్తలు

## మరొక దర్శకుడు

ఈమధ్య తెలుగుపరిశ్రమలోకి అన్ని రంగాలలోనూ కొత్తరక్తం ప్రవేశిస్తుంది. కోదండరామరెడ్డివంటి కొత్త దర్శకులు అచిరకాలంలోనే అగ్రస్థానాలు ఆక్రమిస్తున్నారు. ఇప్పుడు మరొక కొత్త దర్శకుడు రాబోతున్నాడు.

సరేంద్రమూవీస్‌వారు నిర్మిస్తున్న 'కసాయిగుండెలు' చిత్రానికి కొండవీటి సత్యం అనే యువదర్శకుడు దర్శకత్వం వహిస్తున్నాడు. ఆయన చాలాకాలంనుంచి సహాయదర్శకుడుగా పరిశ్రమలో అనుభవం సంపాదించినవాడే. —

# జనవాణి

(3వ పేజి కొనసాగింపు)

కమ్యూనికేషన్ సౌకర్యం ఏర్పడింది కూడా ఈ కాలంలోనే. 800 టెలిఫోను కనెక్షన్లు కలిగి ఉన్నాయి. 10 హరిజనవాడలలో శ్రీరామ మంచినీటి బావులు జిల్లాలో ప్రథమంగా సమగ్ర గ్రామ అభివృద్ధి పథకం ప్రారంభమైంది ఉదయగిరిలోనే.

భూగర్భజలాల అన్వేషణ విరివిగా జరిగింది ఈ మధ్యలోనే. హైదరాబాదు, విజయవాడ, బెంగుళూరు, విమకొండ తదితర దూరప్రాంతాలకు బస్సు సౌకర్యం ఏర్పడింది ఈ కాలంలోనే.

చెప్పుకుంటూపోతే, ఉదయగిరితాలూకాలో ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు జరిగింది, ఈ మధ్యకాలంలో. వీటివెనుక అనాటి ఎమ్మెల్యే శ్రీ వెంకయ్యనాయుడు కృషి, అప్పుడున్న ప్రభుత్వాల సహకారం కూడా పూర్తిగావున్నదనేది అందరికీ తెలిసిన సత్యం. ఈ సత్యం వంచివరెడ్డిగారికి తెలియకపోవటం విచారకరం. పైపెచ్చు ఈ రెండు తాలూకాలూ వెనుకబడి వుండడానికి తన బాధ్యతే ఎక్కువనే నగ్నసత్యాన్ని వంచివరెడ్డి మరచినట్లుంది.



## ★ ఆహ్వానము ★

అల్లూరులో-చండీశతరుద్రయాగం.

భక్తమహాశయులారా! దేశసౌభాగ్యార్థం నెల్లూరుజిల్లా అల్లూరువందుగల శ్రీ బ్రహ్మానంద గీతాశ్రమమందు శ్రీ సిద్ధగిరి ఆశ్రమ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ భక్తబాలాజీనంద భారతీస్వాములవారి పర్యవేక్షణలో శ్రీ చండికాకాలపరమేశ్వరీ ప్రీతిగా

– ఓం శక్తి సత్రయాగం –

20-7-85 మొదలు 9-8-85 వరకు అఖండిత దీక్షతో జరుపబడును. శ్రీ ... వారి అనుజ్ఞాశీర్వాదములతో జరుగు అరుదైన ఈ మహాయాగమును ... ప్రత్యక్షముగా కనపడుటకు భక్తులెల్లరు పాల్గొని యథాశక్తి ... తన ధనధాన్యములను వీలైనంతవరకు అందజేసి దైవకృపను పొంద ... చున్నాము.

సిద్ధేశ్వరానందస్వామి
శ్రీ బ్రహ్మానంద గీతాశ్రమం-అల్లూరు
కోవూరు తాలూకా-నెల్లూరుజిల్లా

## నిరుద్యోగులతో ప్రభుత్వం చెలగాటం

దేశంలో ఎన్నో ప్రైవేటు సంస్థలు నిరుద్యోగులను నిలువుదోపిడీ చేస్తున్న సైనం తెలిసిందే. కానీ ప్రభుత్వసంస్థలు కూడా నిరుద్యోగుల జీవితాలతో చెలగాటమాడుకోవడం బాధాకరం.

నెల్లూరుజిల్లా కలెక్టర్ ఆఫీసులో, ఆఫీసు అసిస్టెంట్ల ఉద్యోగాలకోసం ఈ ఏడాది ఫిబ్రవరిలో కలెక్టర్ సుజాతారావుగారు భారీఎత్తున వ్రాతపరీక్షలు నిర్వహించారు. వున్నది 60 పోస్టులే అయినా దాదాపు 6 వేలమంది అభ్యర్థులు ఈ పరీక్షలు వ్రాశారు. పదవతరగతి అర్హతగా పేర్కొనబడినప్పటికీ, పోస్టు గ్రాడ్యుయేట్‌లు వందలాదిమంది వచ్చి ఈ పరీక్ష వ్రాశారు.

ఆ పరీక్షలు వ్రాసినవారిలో 150 మందిని గత మేనెలలో ఇంటర్వ్యూకి పిలిచారు. కలెక్టర్‌గారే స్వయంగా ఇంటర్వ్యూ జరిపి పాలధర పెంపుమంచి వంటాట్ సమస్యలకూ ప్రశ్నలవర్షం కురిపించి అభ్యర్థుల్ని ఎన్నికచేశారు.

ఇదంతాజరిగాక, ఆ పోస్టుల్ని రద్దు చేస్తున్నట్లు ఆం. ప్ర. సర్వీసుకమిషన్ వారినుంచి దాష్టీకపు చల్లగావచ్చింది. పాపం, ఇంటర్వ్యూలో నెగ్గిన అభ్యర్థులు ఘోరంగా నిరాశచెంది చతికిలబడ్డారు. రాష్ట్ర ప్రభుత్వం అనుమతికోనే కలెక్టర్‌గారు ఈ పరీక్షలు జరిపారట, ఇప్పుడు ఇంతజరిగాక ఆ పోస్టులు రద్దుచేయటం కలెక్టర్‌ను అవమానించడంకాదా? నిరుద్యోగులతో ఆటలాడుకోవడంకాదా?

కలెక్టర్‌గారు ఈ విషయంలో ప్రభుత్వంతో పోరాడిఅయినా, నిరుద్యోగులకు న్యాయంకల్గించాలని కోరుతున్నాను.

అల్లూరు -తిరుమూరు సుధాకరరెడ్డి

## సహకార క్షేత్రాల బాటలో సామాజిక బావులు

అర్జునరావు కలెక్టర్‌గావున్నకాలంలో జిల్లాలో వందలాది సహకార వ్యవసాయ క్షేత్రాలు నెలకొల్పారు. బీదాదిక్కూలకి బంజరు భూములు కేటాయించి, సేద్యం కోసం బావులు త్రవ్వించి. ఇంజన్లు పెట్టించి, పేదవారినినమ్మలేక, ఆ క్షేత్రాలకు ఆర్.డి.ఓ. లను అధిపత్యాలుగా నియమించారు. దీనివల్ల భూమికల్గిన వారికి ఎటువంటి బాధ్యతా లేకుండాపోయి నిర్లక్ష్యం చేయడంతో ఆ క్షేత్రాలన్నీ నిరుపయోగమై పోయాయి. అప్పుడు ఒక్కొక్క బావికి 10 వేల రూపాయలు ఇస్తే, కొందరు సగం త్రవ్వి వదలిపెట్టారు; కొంతమంది పైపైన గుంటలు తీసి, మానివేశారు. ఇచ్చిన ఇంజన్లుకూడా లేకుండాపోయాయి; కాపీ చెడి పనికిరాకుండా పోయాయి; చెరసి ఆ పథకమే నవ్వులపాలై పోయింది.

ఇప్పటి కలెక్టర్ కుమారి సుజాతా రావుగారుకూడా అటువంటి పథకమే కొత్తగా చేపట్టారు. సామాజిక బావుల త్రవ్వకంపేరుతో వేలాది రూపాయలు మంజూరు చేస్తున్నారు, అసైన్‌మెంట్ పొలమున్న హరిజనులకు వీటిని కేటాయిస్తున్నారు.

అయితే ఇక్కడా పాత పొరపాటే జరుగుతున్నది. కలెక్టరుగారు పేదలను నమ్మలేక, వీటికి అధికారులను బాధ్యులను చేస్తున్నారు. వారు, బావులు త్వరత్వరగా త్రవ్వి కలెక్టర్‌గారి మెప్పు పొందాలనే ఆతృత ప్రదర్శిస్తున్నారు తప్ప వాటివల్ల కల్గవలసిన ప్రయోజనాలపట్ల దృష్టి పెట్టడంలేదు.

అసలు, పాత సహకార వ్యవసాయ క్షేత్రాలను ఒకసారి పరిశీలించి, ఇప్పటికి త్రవ్విన బావులను పూడిక తీయించడం, పూర్తికానివాటిని త్రవ్వించడం చేసే తక్కువఖర్చుతో మేలుజరుగుతుంది. వాటిని అన్నేవదిలి, కొత్తవి త్రవ్వడం దండుగ. పాతబావులను పునరుద్ధరించి, వాటికి ఇంజన్లుబిగించి, వారికి ఆర్థిక స్తోమతకలుగజేస్తేప్రయోజనం. ఆ దృష్టి లేకుంటే, అవి అనుభవించిన దుస్థితినే సామాజికబావులుకూడా అనుభవించడం ఖాయం.

ఉదయగిరి -ఎం.వి. నారాయణరెడ్డి
సమితి అధ్యక్షుడు

## కందుకూరు

(4 వపేజి కొనసాగింపు)

### పెండ్లి విందులో విషం- 300 మంది ఆస్పత్రిపాలు

కందుకూరు తాలూకా కావలరంలో ఇటీవల ఒక పెండ్లి విందు 300 మంది అతిథులను ఆస్పత్రి పాలు చేసింది.

ఒక వివాహం సందర్భంగా రాత్రి మిగిలిన దాళ్లో, పప్పుకలిపి మరునాటి ఉదయం వండారట. దానితో అది విషంగా మారిపోయిందట. దీనికితోడు దారు కలిపిన గిన్నెకు చిలుముపట్టివుండడంతో కలరావ్యాధికి కారకమైన విషపదార్థం ఒకటి తయారైందట; రెండు కలిసి, అది తిన్న నాలుగువందలమందిలో, మూడు వందల మందికి ప్రమాదంతెచ్చిపెట్టింది. వీరిలో 85 మంది పరిస్థితి తీవ్రంగా వుందట అందులో 10 మంది పిల్లలు.

అదృష్టవశాత్తు ఆపెళ్ళిలో ఒక లేడీ డాక్టర్ వుండడంవల్ల, ఆమె వెంటనే ప్రమాదం పసిగట్టి, స్థానికంగావున్న ఇంకొక ప్రైవేటు డాక్టరు సహాయంతో అందరికీ వైద్యం జరిపించి ప్రమాదం తప్పించిందట.

## సుమన్

9 వ పేజి కొనసాగింపు

చెవులు కొరుక్కుంటున్నారు.

పెద్దింటి ఆడపిల్లలను తన తుచ్ఛ కోరికలు తీర్చుకోవడానికి. అక్రమ సంపాదనకు వాడుకొని వుంటేమాత్రం సుమన్‌ను అరెస్టుచేయడంకాదు, సంఘ బహిష్కారానికి గురిచేయాలి, అయితే ఎప్పుడో చేసినతప్పుకు, ఇంకొకరి కుట్రకు బలైవుంటేమాత్రం అందెంత నీచుడైనా పాపం పాపభూతి చూపవలసి వుంటుంది.

ఇదిట్లావుంటే సుమన్‌తో సగం సగం చిత్రాలు నిర్మించినవారు, అడ్వాన్సు లిచ్చి కాల్షీట్లు కుదుర్చుకొన్న నిర్మాతలు ఈ సంఘటనవల్ల కుప్పకూలిపోయారు. వారి పరిస్థితి అయోమయంగా వుంది, ఇంకొకప్రక్క, మద్రాసులో థియేటర్ల ఎదురుగా ప్రేక్షకులు నిరసన ప్రదర్శనలు చేయడంతో, పంపిణీదారులు వాటిని విడుదలచేయడానికి జంకుతున్నారు.

అయితే ఆంధ్రదేశంలో మాత్రం సుమన్ చిత్రాలు మామూలుగానే ప్రదర్శింపబడుతున్నాయి. ఇటీవలే విడుదలయిన అమెరికా అల్లుడు చిత్రం కొంతకు కొంత విజయం సాధించడం ఇంకా విచిత్రం. నటుల వ్యక్తిగత జీవితాలకు, సినిమాలకు సంబంధం పోల్చిచూసుకోలేనంత పసివమూర్ఖులైపోయారు నవ ప్రేక్షకులు.

## మండలాలు

(4వ పేజీ కొనసాగింపు)

వరమటినాయుడుపల్లె, చుంచులూరు, ధర్మారావుచెరువుపల్లి, పొంగూరు, చిన మాచర్లపాడు, నాగరాజపాడు.

మొత్తం 21 గ్రామాలు.

**దుత్తలూరు**

కొత్తపాడు, నర్రవాడ, మందళ్ళవల్లి, మందళ్ళ నాయుడుపల్లె, దుత్తలూరు, సోమలరేగడ, వెంకటంపేట, అయ్యవారిపల్లె, పాపంపల్లె, నందిపాడు, కొత్తపేట, బ్రహ్మేశ్వరం, యెరుకొల్లు, భైరవరం, రాచవారిపల్లె, తిమ్మాపురం.

మొత్తం 17 గ్రామాలు

**వరికుంటపాడు**

తోటలచెరువుపల్లి, పెద్దిరెడ్డిపల్లి, పామూరుపల్లి, తూర్పుపాలెం, తొడుగుపల్లె, కొండాయపాలెం, విరూరు, గొల్లపల్లి, మహమ్మదాపురం, వేంపాడు, దామన్‌చెర్ల, దక్కనూరు, కనియంపాడు, భాస్కరాపురం, వరికుంటపాడు, తూర్పు బోయమడుగుల, జలదేంమంగాపురం, గుర్రాది, కాంచెరువు, యర్రంరెడ్డిపల్లె, ఇక్కలపల్లె, తూర్పు చెన్నంపల్లె, జడదేవి, తిమ్మాపురం, తూర్పురొంపిదొడ్ల, నరసింహాపురం, రామదేవులపాడు, గణేశ్వరపురం, బొంగరాయలపాడు,

మొత్తం 29 గ్రామాలు.

**సీతారామపురం**

చింతోడు, పబ్బులేటిపల్లి, చిన్ననాగంపల్లి, పెదనాగంపల్లి, గుండుపల్లి, మారంరెడ్డిపల్లి, జయపురం, దేవిశెట్టిపల్లి, సీతారామపురం, నారాయణంపేట, పండ్రంగి, సింగారెడ్డిపల్లె, అయ్యవారిపల్లె, దేవరాయసూర్యాపల్లె, బాలాయపల్లి, బసినేనిపల్లి, నెమళ్ళదిన్నె, గంగవరం, వరమటిరొంపిదొడ్ల, దేవమ్మచెరువు, పెంపల్లికోట,

మొత్తం 20 గ్రామాలు

**ఉదయగిరి**

అర్లపడియ, వప్పులవారిపల్లె, కోటాయపల్లె, గండిపాలెం, కృష్ణంపల్లి, కుర్రపల్లి, శకునాలపల్లి, పుల్లాయపల్లి, గన్నేపల్లి, మున్నంవారి చింతల, గుడినరవ, తిరుమలాపురం, ఉదయగిరి, బండగానిపల్లి, గంగులవారి చెరువుపల్లి, చాదేపల్లి, అంనవసముద్రం.

మొత్తం 21 గ్రామాలు

**ఆత్మకూరు**

నాగులకండ్ల, అరవీడు, కరటంపాడు, నారంపేట, చిరువెళ్ళ అగ్రహారం, బోయలచిరువెళ్ళ, నల్లపగరం, నమిలిపాడు, నెల్లూరుపాలెం, ఆత్మకూరు, బట్టేపాడు, కమపూరుపల్లి, బండారుపల్లి, దేపూరు, బంగారపల్లి, మహ్మూరుపాడు, నాగులపాడు, మహిమలూరు, గండ్లవీడు, బొటికర్లపాడు, వాసిలి.

మొత్తం 21 గ్రామాలు

**అనుమసముద్రంపేట**

గుంవర్లపాడు, జమ్మవరం, కావలియడవల్లి, అక్బరాబాద్, కూనలమ్మపాడు, బవ్వలగుంటపల్లి, శ్రీకొలను, హసనాపురం, చిరమన, చందలూరుపాడు, అనుమసముద్రం, కార్లపాడు, వందిపాడు, అనుమసముద్రంపేట, పునగోడు, బాజవోలు, పెదబ్బిపురం, చవటకీమవరం, అబ్బాసాహెబ్‌పేట (గుడిపాడు) కరుగోగులపాడు (చంద్రపడియ మజరా) దూబగుంట, కొప్పూరుపాడు, కొండమీదకొండూరు, వేల్పులగుంట,

మొత్తం 24 గ్రామాలు

**అనంతసాగరం**

శేవూరు, మినగల్లు, దేవరాయపల్లె, బిట్ వన్, బిట్టు వెరునుపల్లె, అనంతసాగరం, ఇనగలూరు, అమని చిరువెళ్ళ, గౌరవరం, కొలిదాపురం, బొమ్మవరం, దాపురాళ్ళపల్లి, కన్నెపల్లి (మంగుపల్లి) కామిరెడ్డిపాడు, పాతబ్బపల్లె, ఉప్పలపాడు, వరమటకంభంపాడు, సోమశిల, వరికుంటపాడు, మొత్తం 19 గ్రామాలు

**పొదలకూరు**

మూగాయపాలెం, విరూరు, మహమ్మదాపురం, బాటపర్తి, బత్తులపల్లెపాడు, నల్లపాలెం, వెలిగంటిపాలెం, వేదూరుపల్లె, నిత్తుంపల్లె, తోగపముద్రం, నావూరు, ప్రభగిరిపట్నం, అల్లూర్తి, రేవళ్ళయ్యగుంటపాలెం, పులికొల్లు, నావింటపర్తి, అంకుపల్లె, మొగళ్ళూరు, ఉచ్చపల్లి, గుఠవాయపాలెం, కమవర్తి, నందివాయ, అయ్యగారిపాలెం, తోడేరు, పొదలకూరు, దాటగొట్లు, మరుపూరు, ఉట్లపాలెం, డగ్గుంట, వేగపూడిరాజుపాలెం, దుగ్గుంటరాజుపాలెం, వేగపూడి, ఇనుకుర్తి, మర్రిపల్లెపార్లపల్లె, బిరదవోలు

మొత్తం 38 గ్రామాలు.

**చేజర్ల**

కోటితీర్థం, యనమదల, బిల్లిపాడు, చిత్తలూరు, వావిలేరు, పాదేరు, చేజర్ల, తిమ్మాయపాలెం, గొల్లపల్లె, పెరుమాళ్ళపాడు, పాతపాడు, పెళ్ళూరు, మాముదూరు, ఏటూరు, నెర్నూరు, కాకివాయ, నాగులవెల్లటూరు, కాలాయపాలెం,

**కలువాయ**

కుల్లూరు, మాదన్నగారిపల్లె, బ్రాహ్మణపల్లి, బద్దెవోలు, కలువాయ, ఇక్కలపల్లి, నేతివపల్లి, తోపుగుంట అగ్రహారం, తోపుగుంట, తెలుగురాయపురం, కమపూరుపల్లి, చిదగోపవరం, చింతలపాలెం, ఉయ్యాలపల్లి, యెర్రబల్లి, కోటూరుపల్లి, చీపినాపి, చింతలాత్మకూరు, వల్లకొండ, కేశమనేనిపల్లి, దాచూరు, వెడ్లూరు

మొత్తం 28 గ్రామాలు.

**రాపూరు**

పెనుబర్తి గోపసముద్రం, పెనుబర్తి గోమువల్లి, కానులనాటివారి అగ్రహారం, అకిలివలస, లింగపాలెం, మద్దెమళ్ళ, గుండవోలుపూడి, గుండవోలు, ఈపూరు, నెల్లిపల్లి, తూమాయి, తానంచెర్ల, కంబాలపల్లి, తోకపాలెం, కలిచెర్ల, కానాయపాలెం, అదూరుపల్లి, నాయుడుపల్లి, పంగులూరుపల్లి, వేపినాపి అక్కమాంబపురం, గుండూరుపల్లి, గిలకపాడు, చుట్టుపాలెం, గోనుపల్లిపాయపాలెం, వీరాయపాలెం, బొజ్జనపల్లి, పులిగిలపాడు, రావిగుంటపల్లి, రాపూరు, వంగిలి కోటూరుపాడు, బందేపల్లి, సిద్ధవరం, జోరేపల్లి జోరేపల్లి అక్కమాంబాపురం, మునగల వెంకటాపురం, తెగచెర్ల, గరిమెనపెంట,

— —

### ఊరూ—పేరూ

(4వ పేజీ కొనసాగింపు)

కొద్ది గృహములు కల్గియుండి (చిన్నదైన క్రొత) చిన్నక్రొత అని పేరు కల్గినది.

పై రెండు గ్రామములు, ఘటికాస్థానములై వైదికవిద్యలు, ధర్మాధర్మ నిర్ణయమునకు ఉనికిపట్టయిన గ్రామములుగా ఒకనాడు వెలుగొందినవి.

### వేనాడు, ఇరకం

శ్రీహరికోటలో రాకెట్ కేంద్రం స్థాపించక ముందు, కస్తూ సూళ్ళకు సెటమీద వేయకముందు, శ్రీహరికోట ద్వీపానికి దరిమండి వేనాడు ఇరకం ద్వీపం మీదుగా ప్రయాణించేవారు. ఈ రెండు ద్వీపాలమధ్య 4 మైళ్ళ దూరముంటుంది. వేనాడు జనాభా 1500; ఇరకం జనాభా 700.

వేనాడు ఇరకం అనేవి రెండు తమిళ పదాలు. ఇలక్కం. ఇలగం (లంక) నుండి ఇలక్కంగా మార్పుచెంది వుంటుంది.

వేనాడు, తమిళార్థం వే-వేళ్ళు. తెలుగర్థ వేము. సముద్రంద్వారా దొంగరవాణా అరికట్టడానికి యీ ద్వీపాన్ని చెక్‌పోస్టు మాదిరి ఒకనాడు ఉపయోగించేవారట. అందువల్ల వేనాడైంది. దేసూరు రెడ్లలో వేనాటి అనే యింటిపేరుగలవారున్నారు. వ్యవహారంలో యీవాటివారంటారు.

వేనాటిలో ఒకేచోట, శివ, విష్ణు దేవాలయాలున్నాయి. ఆ దేవతలను శృంగేశ్వరుడు, పెరుమాళ్ళు అనే పేరిట పిలుస్తారు.

— —

# విజయవంతమైన 70 వ రోజు

## శతదినోత్సవానికి ఉరకలు వేస్తున్న ఈ ఏటి మేటిచిత్రం

మీరు మెచ్చిన చిత్రాలు...

భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్

# మాపల్లెలో గోపాలుడు

S.గోపాల్‌రెడ్డి B.Sc(Ag) కోడిరామకృష్ణ

## 20-6-85 నుండి "న్యూటాకీస్" లో

## రోజూ 3 ఆటలు

ప్రదర్శన వేళలు : 2-45 గం, 6-15 గం, 9-45 గం.

-కళ్యాణి ఫిలింస్-నెల్లూరు